

శ్రీమతే రామానుజాయ నమః

# భగవద్గీతలో తత్త్వహిత పురుషార్థాలు

ఆంధ్ర వివరణం

పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

# భగవద్గీతలో తత్త్వహిత పురుషార్థాలు

**(తమిళమూలం - ఉ.వే. శ్రీమాన్ ఎన్.కృష్ణస్వామి అయ్యంగార్, పుత్తూరు అగ్రహారం, తిరుచ్చి.)**

భారతదేశంలో అనాదికాలంగా సుప్రతిష్ఠితం అయిన సనాతనధర్మానికి మూలగ్రంథం వేదమే. అందువల్లనే దానికి వైదికమతమని పేరు. దీనిని వివరించడంకోసం వచ్చిన సాహిత్యం స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు ఇత్యాదిగా అనేకంగా ఉన్నది. వేదంలో పూర్వభాగం అయిన కర్మకాండను వివరించడంకోసం పుట్టినవి మన్వాది స్మృతులు. వీటికి ధర్మశాస్త్రాలని పేరు. వేదంలో ఉత్తరభాగం అని, జ్ఞానకాండం అని చెప్పబడే ఉపనిషత్తులను వివరించడంకోసం వచ్చినవి ఇతిహాసపురాణాలు. పురాణాలు సాత్త్విక-రాజస-తామస భేదేన మూడు విధాలుగా ఉన్నందున రజ-స్తమోగుణాలను కలవారికోసం కొన్ని విషయాలను ఆరోపించి అవి చెబుతాయి. ఇతిహాసాలు ఆ విధంగా కాకుండా ఉన్నది ఉన్నట్లుగా తెలుపుతున్నవి. కనుక అవి ప్రబలతరాలు. మనదేశంలో వేలాది ఏండ్లుగా ప్రసిద్ధి జెందిన శ్రీరామాయణం, మహాభారతం అనేవి రెండు ఇతిహాసాలు. వీటిలో, ఆదికవి అయిన వాల్మీకిచేత రచింపబడ్డ శ్రీరామాయణం నారాయణావతారవిశేషం అయిన శ్రీరాముని మహిమను తెలుపుతున్నది. వేదవ్యాసమహర్షి ప్రణీతమై, పంచమ వేదంగా కీర్తి గడించిన మహాభారతం పంచపాండవుల కథను, వారికి, కౌరవులకు మధ్య జరిగిన మహాభారత సంగ్రామంలో శ్రీమన్నారాయణుని మఱి ఒక అవతారం అయిన శ్రీకృష్ణుడు తన మహిమను అంతటిని చూపి, వారికి విజయాన్ని కల్గించిన చరిత్రనుగూర్చి తెలుపుతున్నది. ఈ మహాభారతంలో సారతమంగా వెలుగొందు తున్నది భగవద్గీత.

తన బంధువులు, గురువులు తనకు ఎదురుగా యుద్ధంకోసం బారులు తీరి యుద్ధరంగంలో నిల్చిన సందర్భాన్ని చూచిన అర్జునుడు "వీరిని అందఱిని ఎదిరించి, వధించి పొందే రాజ్యంతో నాకు ఏమి పని? సుఖంతో ఏమి పని? **"కిం నో రాజ్యేన కిం భోగై ర్జీవితేన వా?"** అని నిశ్చయించుకొని తన చేతిలోని

వింటిని చేజార్చి, తనకు సారథి అయిన శ్రీకృష్ణుని శరణు వేడి తన హితాన్ని ఉపదేశించాలని వేడాడు. శ్రీకృష్ణభగవానుడు అపుడు ఉపనిషత్తులు అనే గోవులనుండి అర్జునుడనే వత్సాన్ని ముందుంచుకొని, గీతామృతం అనే క్షీరాన్ని జ్ఞానులకు పితికి ఇచ్చాడు. అదే గీతాశాస్త్రం.

మన వైదికమతానికి మూలమైన వేదం (ఉపనిషత్తులు), ఆ వేదాంతార్థాన్ని వివరించే, వేదవ్యాసప్రణీతాలైన బ్రహ్మసూత్రాలు, భగవద్గీత- అనే మూడిటిని వేదాలను ప్రమాణాలుగా అంగీకరించే అన్ని మతాలవారు ప్రమాణత్రయం అని కీర్తిస్తారు. మనదేశంలో ఉండే వైదికమతాచార్యులు అందఱు వీటికి భాష్యాలను, వివరణాలను రచించడం ద్వారా తమ మతాలను స్థాపించడానికి ప్రయత్నం చేశారు. ఈ మూడింటిలోను భగవద్గీత సాటి లేని మేటి మహిమను కల్గినది. దీనికి ఆనాటినుండి ఈనాటివరకు వేలాది వ్యాఖ్యానాలు, వివరణలు వ్రాయబడ్డాయి, వ్రాయబడు తున్నాయికూడా. లోకంలోని పలు భాషలలోకి కూడా భగవద్గీత అనువదింపబడింది. ఈ కారణాలవల్ల మూలగ్రంథం అయిన వేదంకంటే, దానికి వివరణరూపంగా ఆవిర్భవించిన బ్రహ్మసూత్రాలకంటే, భగవద్గీత వైదికమతాన్ని వివరించే గ్రంథాలలో ప్రధానంగా వెలుగుతున్నది. **"స్వజ్ఞానం ప్రాపకజ్ఞానం ప్రాప్యజ్ఞానం ముముక్షుభిః , జ్ఞానత్రయ ముపాదేయ మేతదన్యన్న కించన"** అనే రీతిలో ముముక్షువైనవాడు తత్త్వ హితపురుషార్థాల స్వరూపాన్ని తెలియాలి. భగవద్గీతలో ఈ తత్త్వహితపురుషార్థాలు ఏ విధంగా చెప్పబడ్డాయి అనే విషయం సంగ్రహంగా ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది.

## భగవద్గీతలో తత్త్వస్వరూపం

గీతలోని ఏడవ అధ్యాయంలోని నాల్గవ శ్లోకంలో **"భూమి రాపోఽ నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ, అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా"** (భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం - అనే అయిదు భూతాలు, మనస్సు మొదలైన ఇంద్రియాలు, మహాన్, అహంకారం, అనే ఎనిమిది విధాలుగా విభజింపబడ్డ ఈ ప్రకృతి నా సొత్తు అని తెలిసికో) అని జ్ఞానశూన్యాలైన అచేతనవస్తువులకన్నిటికీ కారణం అయిన వాటిని ప్రస్తావించి,



అవి తనకు సొత్తు- అని శ్రీకృష్ణుడు అన్నాడు. అనంతరశ్లోకంలో **"అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్, జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్"** (గొప్ప బాహువులను కలవాడా! అర్జునా! ఈ అచేతనప్రకృతి అవరం. దీనికంటే చాలా భిన్నమైనది, జీవశబ్దవాచ్యమైనది, ముందు తెల్పిన అచేతనప్రకృతికంటే గొప్పది, ఈ లోకాన్ని అంతటిని ధరించేది అయిన ఈ ప్రకృతిని నాది అని గ్రహించు) అని ఈ చేతనద్రవ్యాలను ధరించే చేతనులుకూడా తన సొత్తే అని తెలిపాడు. ఏడవ శ్లోకంలో - **"మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ!, మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"** (అర్జునా! నా కంటే వేఱయిన వాటిలో ఒక్కటి కూడా గొప్పది లేదు. ఈ అన్ని వస్తువులు, దారంలో రత్నాలవలె, నాలో కూర్పబడ్డాయి) అని తాను ఈచేతనా చేతనాలకంటే చాలా గొప్పవాడని, తనకు శరీరంగా ఉండే చేతనాచేతనాలను అన్నిటినీ వాటికి ఆత్మ అయిన తాను, రత్నమాలలో ఉండే దారం రత్నాలను ధరించేటట్లే, ధరిస్తున్నానని అన్నాడు. **"రసోఽ హ మప్సు"** (నీటిలోని రుచిని నేనే) అని ప్రారంభం అవుతున్న ఎనిమిదవ శ్లోకంనుండి ఆరంభించి 11వ శ్లోకంవరకు ఆ విధంగా అన్నిటికీ ఆత్మగా, అవి తనకు శరీరంగా, ప్రకారంగా ఉన్నందువల్ల వాటిని నిర్దేశించే అన్ని శబ్దాలు తననే నిర్దేశిస్తాయని పలు చేతనాలను తనతో ఒకే విభక్తిలో చెప్పడంద్వారా (సామానాధికరణ్యంద్వారా) శ్రీకృష్ణుడు తెలియజేశాడు. తన విభూతులనుగూర్చి (ఐశ్వర్యాలను) తెలిపే పదవ అధ్యాయంలో కూడా ఇరవైయవ శ్లోకంలో తానే అన్ని జీవరాసుల హృదయాలలో ఉండే అంతర్యామి అని, వాటిని సృష్టించి, రక్షించి, లయింపజేస్తానని పల్కి, ఈవిధంగా అన్నివస్తువులకు అంతర్యామిగాను, కారణంగాను ఉండడంవల్ల ఆ వస్తువులను నిర్దేశించే శబ్దాలు తననుకూడా తెలుపుతాయి అనే అంశాన్ని 21వ శ్లోకం నుండి 39వ శ్లోకంవరకు విస్తృతంగా ప్రతిపాదించి, చరాచరాలైన వస్తువులలో తనను విడచి ఉండేది ఒక్కటికూడా లేదు- అని అంటూ తన పల్కులను ముగించాడు. దీనివల్ల చిదచిదీశ్వరులనే మూడు తత్త్వాలను అంగీకరించి, మిగిలిన రెండు తత్త్వాలను శరీరంగా కల్గినవాడై నారాయణుడొక్కడే ప్రకాశిస్తున్నందున అతడొక్కడే తత్త్వం అని చెప్పాలి- అని పలికే విశిష్టాద్వైతవేదాంతాన్నే శ్రీకృష్ణుడు

ఆదరించాడు- అని సుస్పష్టం అవుతున్నది. 11వ అధ్యాయంలోని 40వ శ్లోకంలో **"సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః!"** (నీ కంటే వేఱయిన అన్నిటినీ ఆత్మగా వాటిలో వ్యాపిస్తున్నావు. అందువల్ల ఆ అన్ని వస్తువులను తెలిపే పదాలచేత చెప్పబడుతున్నవాడవు అవుతున్నావు) అనే అర్జునుని వాక్యంకూడా దీనిని బలపరుస్తున్నది.

"జీవులు ముక్తిదశలో పరమపురుషునితో ఒకటి అవుతున్నారు. వారు భిన్నులు కారు'' అని పలికే అద్వైతమతానికి ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా, గీతాశాస్త్రాన్ని ఉపదేశించడం ప్రారంభించినపుడే శ్రీకృష్ణభగవానుడు అది తనకు అభిమతం కాదని ఉద్ఘాటించాడు. గీతోపదేశ ప్రారంభం అయిన రెండవ అధ్యాయంలోని **"న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః, న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్"** (సర్వేశ్వరుణ్ణి అయిన నేను పూర్వకాలంలో ఏనాడూ లేను అనేది లేదు. జీవుడవైన నీవు కూడా పూర్వం ఏనాడూ లేవు అనేది లేదు. జీవులైన ఈ రాజులు కూడా పూర్వకాలంలో ఏనాడు లేరు అనేది లేదు. నేను, నీవు, వీరు- అనే మనం అంతా దీనికి పిమ్మట గల కాలంలో కూడా ఉండబోము అనేది లేదు) అనే 12వ శ్లోకంలో శ్రీకృష్ణుడు **"అహమ్, త్వమ్, ఇమే, జనాధిపాః, సర్వే, వయమ్''** అనే పదాలను ప్రయోగించడంద్వారా సర్వేశ్వరుడైన తన కంటే జీవులు వాస్తవానికి భిన్నులు అని, జీవులు కూడా పరస్పరం భిన్నులు అని తెలియజేశాడు. అజ్ఞానంతో మోహాన్ని పొంది నిలచి వున్న అర్జునునిగూర్చి శ్రీకృష్ణుడు ఉపదేశిస్తున్నాడు కనుక మోహదశలో అసత్యంగా తోచే వస్తువులనుగూర్చి ఉపదేశించడు. అర్జునుని మోహాన్ని తీర్చడంకోసం యథార్థంగా, నిత్యంగా ఉండే తత్త్వాలను ఉపదేశించే సమయం కనుక, **"అహమ్, త్వమ్, ఇమే, వయమ్"** అనే పదాలలో జీవులమధ్య, సర్వేశ్వరునకు, జీవులమధ్య భేదమే తత్త్వం అన్నదే శ్రీకృష్ణుని అభిప్రాయంగా సిద్ధిస్తుంది. **"అహమ్"** అని అంటూ సర్వేశ్వరుడైన తనను నిర్దేశించుకొన్నాడు. **"త్వమ్"** అనే పదం ఎదురుగా ఉండే వేఱొక చేతనుడైన అర్జునుని నిర్దేశిస్తుంది. **"ఇమే"** అనే పదం తమకు అభిముఖంగా ఎదురొడ్డి నిలుచున్న పలువురు చేతనులను నిర్దేశిస్తుంది. **"సర్వే వయమ్"** అనే పదాలు



ఈ విధంగా పరస్పరం భిన్నులైన చేతనులు అసంఖ్యాకులు - అని తెలుపుచున్నది. ఇక్కడ అద్వైతులు "దేహాలలోని బహుత్వాన్ని చూచి శ్రీకృష్ణుడు బహువచనంలో పలికాడు, ఆత్మల బహుత్వాన్ని ఉద్దేశించి కాదు'' అని వ్యాఖ్యానిస్తారు. వారి పక్షంలో ఆత్మభేదంవలె దేహాలు, దేహభేదం అసత్యం కనుక, దేహభేదాన్ని ఉద్దేశించి శ్రీకృష్ణుడు పల్కుతున్నాడు- అనే మాట పొసగదు, అంతేకాక, అద్వైతుల మతానుసారం శాస్త్రాన్ని ఉపదేశించడం, దానిని ఉపదేశించేవాడు, దానిని వినేవాడు, దాని ఫలం- అనేవి ఏవీ పొసగవు- అని ఇక్కడ ఈ సందర్భంలో భగవద్రామానుజులు తమ గీతాభాష్యంలో వివరంగా నిరూపించారు.

13వ అధ్యాయంలో **"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!" (13-2)** (భరతకులంలో పుట్టినవాడా! దేవతలు మానవులు మొదలైన అన్ని శరీరాలలో ఉండే క్షేత్రజ్ఞుడనబడే ఆత్మకూడా నేనే అని తెలిసికో) అని జీవబ్రహ్మల అభేదాన్ని చెబుతున్నదని అద్వైతులు అంటారు. ఇక్కడ **"క్షేత్రజ్ఞం మాం విద్ధి"** అని అనకుండా, **"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి"** అని **'చ, అపి"** అని రెండు పదాలు ప్రయోగింపబడ్డాయి. ముందు శ్లోకంలో చెప్పబడినదానితో కలుపబడానికి **"చ"**కారం (సముచ్చయార్థకం) ఒక్కటే సరిపోతూ ఉండగా, దానికి మించి **"అపి"** శబ్దాన్ని ప్రయోగించడంవల్ల "ముందు శ్లోకంలో చెప్పబడ్డ క్షేత్రాన్నికూడా నన్నుగా తెలిసికో" అనే అర్థం కూడా తెలుపబడుతున్నది. 'క్షేత్రం అనబడే శరీరం క్షేత్రజ్ఞుడనబడే జీవునకు విశేషణంగా ఉండడమే స్వభావంగా కల్గినది కావడంవల్ల, అతనిని విడచి ఉండని స్వభావాన్ని ఉద్దేశించి, అతనితో ఒకే విభక్తిలో చెప్పదగినదిగా ఏ విధంగా అవుతున్నదో, ఆ విధంగానే క్షేత్రం, క్షేత్రజ్ఞుడు నాకు విశేషణంగా ఉండడమే స్వభావంగా కల్గినవి కనుక, నన్ను విడచి అవి ఉండ లేని స్థితినిబట్టి, నాతో ఒకే విభక్తిలో నిర్దేశించదగినవిగా అవుతున్నాయని తెలిసికో'' అని భావం. అపి శబ్దంతో శరీరాన్నికూడా తానే అని సూచించడంవల్ల జీవుని అతని శరీరంతో ఒకే విభక్తిలో నిర్దేశించడానికి ఏ శరీరాత్మభావం కారణమవుతున్నదో, ఆ శరీరాత్మభావమే క్షేత్ర- క్షేత్రజ్ఞులకు, నాకు మధ్య ఉన్నది. ఈ విధంగా అపృథక్ సిద్ధమై శరీరంగా ఉండడాన్ని

పురస్కరించుకొని క్షేత్ర-క్షేత్రజ్ఞులను నాతో ఒకే విభక్తిలో నిర్దేశించడం ముఖ్యమైనదే కాని, గౌణం కాదు - అని భావం. అందువల్ల ఈ శ్లోకంవల్లకూడా అద్వైతుల మతం సిద్ధించదు- అనే విషయాన్ని శ్రీరామానుజులు గీతాభాష్యంలో చాలా విస్తృతంగా నిరూపించారు. గీతలో కూడా పలు సందర్భాలలో అచేతనవస్తువులను, చేతన వస్తువులను పరమాత్మతో ఒకే విభక్తిలో నిర్దేశించడానికి కారణం - పరమాత్మ వాటికి ఆత్మకావడం, వాటిని అతడు శరీరంగా కల్గి ఉండడం- అని వివరింపబడిందనే విషయం పూర్వోక్తం.

"జగత్తు మిథ్య, జీవుడు, బ్రహ్మ స్వరూపంలో ఒకటే'' అనే కేవలాద్వైతం గీతలో అంగీకరింపబడకపోయినా, వేదశాస్త్రాలవల్ల సిద్ధించే రెండు విధాలైన అద్వైతాలు గీతలో చెప్పబడ్డాయి. అవి జీవాద్వైతం అని, బ్రహ్మాద్వైతం అనబడతాయి. ఇవి ప్రకారాద్వైతమని, ప్రకార్యద్వైతమని కూడా చెప్పబడతాయి. ఒక మానవునకు అతడు అలంకరించుకొన్న కుండలాలు మొదలైన ఆభరణాలు, చేతిలో ధరించిన చేతిదండం మొదలైనవి ప్రకారాలు అనబడతాయి. అయితే, ఇవి ఎల్లప్పుడు అతనిని నిరూపించే ప్రకారాలు కానందువల్ల **"అనియతప్రకారాలు"** అనబడతాయి. కాని, వస్త్రానికి శ్వేతత్వం, ఘటాది పదార్థాలకు ఘటత్వాది జాతిమొదలైనవి ఆ వస్తువులు ఉన్నంతవరకు వాటికి విశేషణాలుగా ఉంటాయి. కనుక అవి **"నియతప్రకారాలు"** అనబడతాయి. చేతనాచేతనాలతో నిండిన పరబ్రహ్మను ఏనాడు విడచి ఉండని (అపృథక్ సిద్ధమైన) విశేషణంగా ఉన్నందున ఆ పరబ్రహ్మకు నియత ప్రకారంగా ఉన్నది. ప్రకారి అయిన (విశేషణం అయిన) పరబ్రహ్మ ఒకటే. తాను తప్ప మిగిలిన జగత్తును అంతటిని ప్రకారంగా కల్గినదై ఉన్నది. అదే రీతిలో అంతటికీ ప్రకారిగా ఉండే వేఱొక వస్తువు ఏదీ లేదు. ఇదే ప్రకార్యద్వైతం, లేక, బ్రహ్మాద్వైతం. అనబడుతున్నది. ఈ అద్వైతాన్నే **"మత్తః పర తరం నాన్యత్ కిం చిదస్తి ధనంజయ!"** (గీత- 7-7) అని ఇతఃపూర్వం ఉట్టంకింపబడ్డ శోకం తెలుపుతున్నది. ఈ అద్వైతంతో అన్నిటినీ ప్రకారంగా కల్గిన రెండవ వస్తువు లేదు- అని సిద్ధిస్తుందే తప్ప ప్రకారంగా ఉండే జగత్తు లేదు- అని తేలదు. ఇదే **"ఏక మేవాద్వితీయమ్"** అనే ఛాందోగ్యశ్రుతి యొక్క తాత్పర్యం. 'చోళరాజు



అద్వితీయుడై ఉన్నాడు' అంటే, అతనివలె ఇంకొక గొప్ప రాజు లేడు- అనే అర్థం సిద్ధిస్తుందే తప్ప, అతనికి పత్ని, పుత్రులు, మంత్రి, సేవకులు లేరని అర్థం సిద్ధించదు కదా!

ఇక, ప్రకారాద్వైతం అనబడే జీవాద్వైతం ఏమంటే- ఒక గ్రామంలో ఉండే గృహాలలో ఒకే జాతికి చెందిన **"రాజనాల"** ధాన్యం ఉన్న కారణాన్నిబట్టి, "ఒకే ధాన్యం'' అని అన్నట్లే. అన్ని శరీరాలలో ఉండే జీవాత్మలు స్వరూపంలో భిన్నాలు అయినా, ఒకే జాతికి చెందినవారు, ఒకే ప్రకారానికి చెందినవారు అనే భావంతో జీవులు అందఱూ ఒకటే అని అనడం జీవాద్వైతవాదం. అంటే- శరీరంలో ఉండే దేవత్వ- మనుష్యత్వ - స్థావరత్వాది భేదాలు, స్త్రీత్వ- పురుషత్వాది భేదాలు ఆత్మస్వరూపానికి చెందినవి కావు. ఆత్మలన్నీ నిత్యులై ఉండడం, అణువై ఉండడం, జ్ఞానాన్ని స్వరూపంగా కల్గి ఉండడం, జ్ఞానాన్ని గుణంగా కల్గి ఉండడం, భగవానునకు శేషభూతులై ఉండడం- అనే సమానస్వభావాలతో కూడినవారని భావం. ఈ విషయం గీతలోని **"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ స్వపాకే చ పండితా స్సమదర్శినః"** (జ్ఞానులు విద్యను వినయాన్ని కల బ్రాహ్మణునిలో, అవి ఏవీ లేని బ్రాహ్మణునిలో, రూపంలో చిన్నది అయిన గోవులో, రూపంలో పెద్దది అయిన ఏనుగులో, కుక్కలో, దానిని చంపి తినే ఛండాలునిలో (ఆత్మ ఒకే విధంగా ఉన్నందువల్ల) సమమైన దృష్టిని కల్గి ఉంటారు) అనే శ్లోకంలో చెప్పబడింది. దీనివల్ల, ఆత్మలలో పురుష ఆత్మ, స్త్రీ ఆత్మ, పక్షి ఆత్మ, పాము ఆత్మ అనే భేదాలు ముక్తిదశలోకూడా అంగీకరించే ద్వైతమతం గీతలో అంగీకరింపబడలేదని వ్యక్తమవుతున్నది. ఈ విధంగా చేతనులవలె నిత్యమై, వికారరహితమై ఉండడం కాకుండా, సదా వికారాన్ని పొందేవైన అచేతనవస్తువులు అసత్యమైనవి అని చెప్పబడ్డాయి అని, దానివల్ల అవి శశశృంగాదులవలె బొత్తిగా లేని వస్తువులని సిద్ధించదు - అని తెలుస్తున్నది.

ఈ విధంగా చిత్, అచిత్, ఈశ్వరుడు - అనే మూడు తత్త్వాలు సత్యాలు అని, చేతనా చేతనాలు అన్నిటినీ తనకు శరీరంగా కల నారాయణుడొక్కడే పరబ్రహ్మ మని గీతవల్ల తెలుస్తున్నది. శివుడు మొదలైన దేవతాంతరాలు

పరతత్త్వం అని పలికే శైవాది మతాలకు, శక్తిని పరతత్త్వంగా పలికే శాక్తమతాలకు ఎంతమాత్రం గీతలో చోటు లేదు- అని కూడా స్పష్టపడుతున్నది.

### భగవద్గీతలో హితం (ఉపాయం)

కర్మయోగం, జ్ఞానయోగం మొదలైనవానిని అంగాలుగా కల భక్తియోగంతో భగవానుని పొందవచ్చు అనేది గీతలో సారమైన అర్థంగా కన్పిస్తుంది. మొదటి ఆఱు అధ్యాయాల సంగ్రహం- **"జ్ఞానకర్మాత్మికే నిష్ఠే యోగలక్ష్యే సుసంస్కృతే, ఆత్మానుభూతిసిద్ధ్యర్థే పూర్వషట్కేన శోధితే"** (గీతార్థ సంగ్రహం-2) (శేషత్వజ్ఞానం, ఇతర విషయాలలో సంగం లేకపోవడం మొదలైన బుద్ధివిశేషాలతో చక్కగా అలంకరింపబడ్డ జ్ఞానయోగం, కర్మయోగం ఆత్మసాక్షాత్కారం అనే యోగాన్ని పొందడంకోసం, దానికి తరువాత ఆత్మానుభవాన్ని పొందడంకోసం గీతలోని మొదటి ఆఱు అధ్యాయాలలో విధింపబడినవి) అని, మధ్యమ షట్కంలోని, అంటే 7వ అధ్యాయంనుండి 12వ అధ్యాయం వరకు గల ఆఱు అధ్యాయాలలోని సారం- **"మధ్యమే భగత్తత్త్వయాథాత్మ్యావాప్తిసిద్ధయే, జ్ఞానకర్మాభినిర్వర్త్యో భక్తియోగః ప్రకీర్తితః"** (గీతార్థ సంగ్రహం- 3) (మధ్యలోని ఆఱు అధ్యాయాలలో భగవానుడనే పరతత్త్వంలోని యథార్థమైన అనుభవం కల్గడంకోసం జ్ఞానంతోకూడిన కర్మయోగంతో కలిగే భక్తియోగం చెప్పబడింది) అని ఆళవందార్ గీతార్థసంగ్రహంలో అనుగ్రహించారు. తత్త్వహితాలనుగూర్చి మొదటి రెండు షట్కాలలో చెప్పబడని విషయాలు మూడవ షట్కంలో - అంటే - చివరి ఆఱు అధ్యాయాలలో వివరింపబడ్డాయి - అని కూడా వారు అన్నారు. గీతా భాష్యంలో కూడా శ్రీరామానుజులు ఈ విషయాలను స్పష్టంగా తెలిపారు. అయితే, భక్తియోగాన్నిగూర్చి ప్రారంభించే ఏడవ అధ్యాయంనుండి గీతాశ్లోకాలను, వాటి భాష్యాన్ని జాగ్రత్తగా గమనిస్తే, వాస్తవానికి మోక్షానికి సహజమైన ఉపాయం భగవానుడే అని, మానవుల ప్రయత్నం మొదలైనవి అన్నీ సోపాధికోపాయాలే అని, తన మంచికోసం తాను పాటు పడడాన్ని అనాదికాలంగా స్వభావంగా కల్గిన జీవునకు తానే (భగవానుడే) ఉపాయం అని, ఈ నిజాన్ని తెలుపడం కోసమే అతనికి చాలా సులభం అయిన కర్మజ్ఞాన



భక్తియోగాలలో ఆసక్తిని కల్గించి, మోక్షోపాయంగా అతనికి పరభక్తిని విధించి, దానికి అంగంగా ఆత్మనుగూర్చిన యథార్థజ్ఞానాన్ని నిరంతరం అనుసంధించేటట్లు చేసి, ఆ అనుసంధానంయొక్క అర్థాన్ని చక్కగా తెలియగానే భగవానుడే ఉపేయంగా ఉండడమే కాకుండా, ఉపాయంగాను ఉన్నాడు- అనే జ్ఞానాన్ని, దాని ఫలంగా పరజ్ఞానాన్ని అతనికి కల్గించి, ఆ తరువాత భగవానుని క్షణంకూడా విడచి ఉండడాన్ని సహించలేకుండా ఉండడం అనే పరమభక్తిని అతనికి కల్గిస్తాడు- అని, ఆ పరమభక్తి కలుగగానే అతడు ప్రారబ్ధకర్మానుసారం ఇంకా కొన్ని జన్మలు ఎత్తవలసి ఉన్నా, పరభక్తి కల్గిన ఆ జన్మలోనే అతనిని మోక్షాన్ని అనుగ్రహిస్తాడని శ్రీకృష్ణుడు తెలుపడాన్ని గమనించవచ్చు.

ఏడవ అధ్యాయంలో భక్తి యోగాన్ని ఉపదేశించడానికి ప్రారంభించే ముందు "భక్తియోగాన్ని అనుష్ఠించేవాడు అనుసంధించవలసిన నన్నుగూర్చిన యథార్థజ్ఞానాన్ని నిస్సందేహంగా, సుస్పష్టంగా పరిపూర్ణంగా చెబుతున్నాను'' అని మొదటి శ్లోకంలో భగవానుడు అన్నాడు. రెండవ శ్లోకంలో "ఈ జ్ఞానాన్ని పూర్ణంగా పొందితే తెలియవలసినది ఇక ఏమీ లేదు'' అని కూడా అన్నాడు. మూడవ శ్లోకంలో "లోకంలో ఉండే మానవులలో వేయిమందిలో ఒకడే శబ్దాదివిషయాలను విడచి మోక్షంకోసం దానిని పొందేంతవరకు ప్రయత్నిస్తాడు'' అని, "వారిలో పలువురు తమ ఆత్మను తాము అనుభవించడం అనే అధమమైన కైవల్యాన్ని పొంది తావన్మాత్రంతో తృప్తిపడతారు. కనుక, మోక్షం కోసం ప్రయత్నించేవారిలో కూడా వేయిమందిలో ఒక్కడే నన్నే ప్రాప్యంగా గ్రహించి, నన్ను పొందడం అనే పరమార్థాన్ని పొందేంతవరకు ప్రయత్నిస్తాడు'' అని, వారిలో సైతం వేయికి ఒకడే నేను ప్రాప్యంగా ఉండడమేకాక, ప్రాపకంగా కూడా ప్రాపకంగా ఉన్నాను- అని తెలిసికొంటాడు- అని అన్నాడు. ఇక్కడ మొదట ఉన్న ఇద్దరిని గూర్చి చెప్పేటపుడు (కైవల్యనిష్ఠుడు, భగవత్ప్రాప్తి నిష్ఠుడు) ప్రయత్నం చేస్తాడు- అని చెప్పి, మూడవవానిని గూర్చి పలికేటపుడు "ప్రయత్నం చేస్తాడు'' అని అనకుండా యథాతథంగా తెలిసికొంటాడు- అని మాత్రమే అన్నందువల్ల ఉపాయం భగవానుడే అయినందువల్ల, అతనిని పొందడం కోసం చేసే అన్ని ప్రయత్నాలనుండి విరమించి, అతడే ప్రాప్యం, ప్రాపకం మొదలైన

అన్నీ అని తలచే సిద్ధోపాయ నిష్ఠుడైన అధికారియే ఇతడు- అని తెలుస్తున్నది. అటువంటివాడు ఎవ్వడూ లేడు- అని శ్రీకృష్ణుడు తలుస్తున్నాడు అనే విషయాన్ని భాష్యకారులు ఈ అధ్యాయం లోని 19, 25 శ్లోకాలను ఆధారంగా (ప్రమాణంగా) చూపి నిరూపించడంవల్ల ప్రవృత్తిపరులు నిండిన ద్వాపరయుగం వరకు, భగవత్ ప్రవృత్తి విరోధిస్వప్రవృత్తి నివృత్తిలో (భగవానుడు చేతనుని పొందడంకోసం అతడు చేసే ప్రయత్నాలకు అడ్డుగా ఉండే, తన మంచికోసం తాను చేసే ప్రయత్నాలనుండి జీవుడు విరమించడం అనే ప్రపత్తిలో) నిష్ఠను కల్గి ఉండే ఆళ్వార్లవంటి అధికారులు ఆకాలంలో లేరు- అని తెలుస్తున్నది. నాల్గవ శ్లోకంలో అచేతన సమష్టి వస్తువులు అన్నీ పరమపురుషుడైన తనకు పరతంత్రాలు - అని అన్నాడు. అయిదవ శ్లోకంలో ఆ అచేతనవస్తువులకు మించిన చేతనసమష్టికూడా తనకు పరతంత్రం అని అన్నాడు. ఇందువల్ల చేతనుడు అచేతనంవలె పరతంత్రుడు కనుక తన హితంకోసం తాను పాటుపడడం ఆత్మ- పరమాత్మలనుగూర్చిన యథార్థజ్ఞానానికి సుతరాం విరుద్ధం అని తెలుపబడింది. ఆఱవ శ్లోకంలో ముందు తెలియజేసిన చేతనాచేతనసమిష్టివస్తువులకు తానే కారణంగాను, శేషిగాను ఉన్నానని అన్నాడు. దీనివల్ల కారణంగాను, శేషిగాను ఉండే తానే కార్యరూపంగాను, శేషంగాను ఉండే చేతనుని హితంకోసం పాటుపడవలసినవాడని తెలిపినట్లయింది. ఏడవ శ్లోకంలోని పూర్వార్ధంలో కల్యాణగుణాలలో జీవులకంటే గొప్పవాడు తానే అని అన్నాడు. ఇందువల్ల జ్ఞానం, శక్తి మొదలైన వానిలో తక్కువవారైన జీవులు తమ మంచికి తాము పాడుపడడంకంటే తమ బాధ్యతను నావద్ద అప్పగించడం మంచిది- అని తెలిపాడు. ఏడవ శ్లోకం ఉత్తరార్ధంలో తానే అంతటికీ శరీరియై ఉన్నందువల్ల, శరీరానికి మంచిని అన్వేషించడానికి శరీరి అయిన తనకే బాధ్యత ఉన్నది అని, శరీరానికి తన హితం కోసం తానే అన్వేషించుకొనే బాధ్యత లేదు- అని తెలియజేశాడు. ఈ కారణాలవల్ల శ్రీకృష్ణుడు చేతనులకు తానే సహజమైన ప్రాప్యంగాను, ప్రాపకంగాను ఉండేవాడని స్పష్టపఱచాడు. ఎనిమిదవ శ్లోకం మొదలు పన్నెండవ శ్లోకంవరకు చేతనాచేతన వస్తువులలో వాటి ప్రాప్యత్వానికి, ప్రాపకత్వానికి తగిన గొప్పతనాలు అన్నీ తనవల్లనే కల్గుతున్నవి అని, తాను



వాటికి అధీనుడు కాడని తెలిపాడు. ఈ పన్నెండు శ్లోకాలలో పరమపురుషుడనే శ్రీకృష్ణుడు తననుగూర్చిన యథార్థజ్ఞానాన్ని తెలియజేశాడు అనే దానిని **"స్వయాథాత్మ్యమ్"** అనే పదప్రయోగంద్వారా గీతార్థసంగ్రహంలో (11) తెలియజేశారు- భగవద్యామునులు.

ఈ రీతిలో భగవానుడే ఉపాయంగాను, ఉపేయంగాను ఉన్నపుడు దానిని ఎందువల్ల జీవులు తెలిసికోలేక పోతున్నారు? అనే ప్రశ్న తల ఎత్తుతుంది. 13వ శ్లోకంలోను, 14వ శ్లోకంలోని పూర్వార్ధంలోను "నన్నుగూర్చి ఈ యథార్థజ్ఞానాన్ని నాకు చెందిన అచేతనప్రకృతియొక్క సంబంధం జీవునకు తెలియకుండా మఱుగుపరస్తున్నది" అని భగవానుడు సమాధానాన్ని తెలిపాడు. 14వ శ్లోకంలోని ఉత్తరార్ధంలో "జీవునకుండే ఈ ప్రకృతిసంబంధం నన్ను శరణు పొందడంవల్ల తీరుతుంది" అని కూడా తెలిపాడు. ఈ విధంగా స్వప్రయత్నంలో అభినివేశాన్ని కలవాడుకూడా ఆ యా సందర్భాలలో తనను శరణు పొందే ఆటంకాలను తీర్చుకోవాలని తెలిపాడు. పదిహేనవ శ్లోకంలో పాపాలను అధికంగా చేసిన నాల్గు విధాలైన జీవులు తనను శరణు పొందడం లేదు- అని చూపాడు. ఈ అధ్యాయంలోని ఈ రెండవ భాగం - **"ప్రకృత్యా అస్య తిరోధిః శరణాగతిః"** (పరమపురుషునిగూర్చిన యథార్థస్థితి జీవునకు ప్రకృతివల్ల మఱుగుపడుతున్నది ఆ అజ్ఞానాన్ని పోగొట్టేది శరణాగతి) అని భగవద్యామునులచేత గీతార్థ సంగ్రహంలో (11) సంగ్రహంగా సూచింపబడింది.

ఈ విధంగా పాపం భూయిష్ఠంగా ఉండే జీవులకు విరుద్ధంగా పుణ్యాన్ని ఎక్కువగా కల నాల్గు విధాలైన జీవులు వారి వారి పుణ్యాలలోని తారతమ్యానికి తగినట్లు ఐశ్వర్యాన్ని కాని, ఆత్మానుభవమనే కైవల్యాన్ని కాని, నన్ను కాని పొందాలని కోరి, దానికోసం నన్ను శరణు పొంది, నాపట్ల భక్తిని కల్గి ఉన్నారు- అని 16వ శ్లోకంలో తెలిపాడు. ఇక్కడ నాల్గు విధాలైనవారు చెప్పబడినా ఆర్తుడు, అర్థార్థి - అనే ఇద్దఱు ఐశ్వర్యార్థులనే ఒకే వర్గానికి చెందినవారు. అందువల్ల ఐశ్వర్యాన్ని కోరేవారు, కైవల్యార్థులు, పరమాత్మప్రాప్తిని కోరేవారు- అనే ముగ్గురు క్రమంగా ఒకరిని మించి ఇంకొకరు గొప్ప పుణ్యాన్ని చేసినవారు- అనే విషయం ఈ శ్లోకంలోని **"సుకృతినః"** అనే పదంవల్ల వ్యక్తం అవుతున్నది. ఈ పదాన్ని

వ్యాఖ్యానిస్తూ శ్రీభాష్యకారులు "**సుకృతగరీయస్త్వేన ప్రతిపత్తి వైశిష్ట్యాత్ ఉత్తరోత్తర మధికతమా భవంతి**' (ఒకనికి మించి ఇంకొకడు గొప్ప పుణ్యాన్ని చేసినవారు కావడంవల్ల వారు కోఱే ఫలంకూడా ఒకదానిని మించి ఇంకొకటి గొప్పదై ఉంటుంది కనుక, ఒకరికి మించి ఇంకొకరు గొప్పవారు అవుతున్నారు) అని అనుగ్రహించారు. తక్కువ పుణ్యాన్ని కలవాడు ఆ పుణ్యానికి అనుగుణంగా ఐశ్వర్యాన్ని కోరుతున్నాడు. అతనికంటే మిక్కిలి పుణ్యం కలవాడు ఆత్మానుభవమనే కైవల్యాన్ని కోరుతున్నాడు. అతనికంటే ఎక్కువ పుణ్యాన్ని కలవాడు అన్నిటికంటే గొప్ప ఫలం అయిన నన్నే కోరుతున్నాడు. వారు వారు కోరిన ఫలాన్ని పొందడంకోసం నన్ను శరణు పొంది ఉపాసన విరోధి అయిన పాపాన్ని పోగొట్టుకొని, తమ కోరికను నెఱవేర్చుకోవడంకోసం నన్నే ఉపాసిస్తున్నారు'' అనేది శ్లోకంలోని సారార్థం- అని ఈ భాష్యంవల్ల స్ఫుటమవుతున్నది. వీరిలో చాలా గొప్పవాడైన జ్ఞానికూడా పరమపురుషుని పొంది, తాను మహానందాన్ని పొందడంకోసం భక్తియోగం అనే ప్రయత్నాన్ని చేస్తాడు- అనేది గ్రహించదగిన విషయం. పదిహేడవ శ్లోకంనుండి ఆరంభించి పద్దెనిమిదవ శ్లోకంవరకు మిగిలిన భక్తులకంటే ఈ ఉపాసక జ్ఞానికి గల వైలక్షణ్యం చెప్పబడింది. 19వ శ్లోకంలో "పలు జన్మలు గడచిన తరువాత ఉపాకుడైన జ్ఞానికి పరమపురుషుని గూర్చిన తత్త్వజ్ఞానాన్ని అనుసంధించడంవల్ల "భగవానుడే ప్రాప్యం, ప్రాపకం అనే జ్ఞానం కలిగి అతడే సర్వస్వంగా భావించి ఆశ్రయిస్తాడు. ఈ జ్ఞానం ఏర్పడిన జన్మయే ఇతనికి అంతిమ జన్మ. ఇటువంటి జ్ఞాని మహాత్ముడనదగినవాడు. భగవానునకు సైతం దుర్లభుడు'' అని చెప్పబడింది. దీనివల్ల, భగవానుని ప్రాప్యంగాను, స్వప్రయత్నం అనే భక్తియోగాన్ని ప్రాపకంగాను భావించే ఉపాసకజ్ఞానికి తన స్వరూపానికి సంబంధించిన జ్ఞానం పూర్ణంగా లేదు- అని, "భగవానుడే ప్రాపకం కూడా'' అనే తత్త్వ జ్ఞానం ఏర్పడినపుడే భక్తిని సాధనంగా భావించే భావన తొలగి, అది (భక్తి) స్వయంప్రయోజనమైన భక్తిగా పరిణమించి, అతడు ప్రపన్నుడు అవుతాడు. కనుక "**మహాత్మా**" అని ప్రశంసింపదగినవాడవుతున్నాడు- అని తెలుపబడింది. "**బహూనాం జన్మనా మంతే**" అని అన్నందున ప్రారబ్ధకర్మ



ఇంకా మిగిలి ఉన్నా ప్రపన్నుడై పరిణమించిన ఈ జన్మయే అతనికి చివరి జన్మ అని కూడా తెలుపబడింది. భగవానుడు భక్తియోగాన్ని విధించడంలో ఉద్దేశ్యం - ఆ ఉపాసకుడు ఈవిధంగా మహాత్ముడైన జ్ఞానిగా పరిణమించాలి అనే ఉద్దేశ్యంతోనే- అని వ్యక్తమవుతున్నది. ఇరవైయవ శ్లోకంనుండి ఆరంభించి ఇరవై అయిదవ శ్లోకంవరకు ఇటువంటి మహాత్ముడైన జ్ఞాని చాలా గొప్పవాడు - అని దృఢీకరించడంకోసం పలు చోట్ల జన్మలు నన్నుగూర్చిన జ్ఞానాన్ని లేకుండా రాజస - తామసశాస్త్రాలను ఆదరించి ఆశ్రయించి, దేవతాంతరాలను ఉపాసించేవారై, తనను పరమాత్మగా తెలియలేని అజ్ఞానులుగా జీవిస్తారని శ్రీకృష్ణుడు అన్నాడు. జ్ఞానియొక్క గొప్పతనాన్ని చూపడంలో దృష్టిని కల్గినవి- ఈ శ్లోకాలు. ఈ భాగాన్ని "**భక్తభేదః ప్రబుద్ధస్య శ్రైష్ఠ్య ముచ్యతే**" (భక్తులు నల్గురిలో జ్ఞానియొక్క గొప్పతనం చెప్పబడింది) అని శ్రీయామునులుకూడా గీతార్థసంగ్రహంలో సంగ్రహంగా వచించారు.

ఇరవై ఆఱవ శ్లోకంలో "నేను అందఱు బద్ధజీవులను తెలిసినా, వారుమాత్రం నన్ను యథాతథంగా తెలియలేరు'' అని అన్నాడు. మూడవ శ్లోకంలోని భాష్యంలో భాష్యకారులు "భగవానుని తత్త్వతః తెలిసినవాడెవడూ లేడు'' అని పల్కి, దానికి ప్రమాణంగా "**స మహాత్మా సుదుర్లభః**"అని పందొమ్మిదవ శ్లోకంలోని భాగాన్ని "**మాం తు వేద న కశ్చన**" (నన్ను ఎవడూ తత్త్వతః తెలియలేడు) అని ఈ శ్లోకభాగాన్ని ప్రమాణంగా చూపబడడాన్నిబట్టి ఆళ్వార్లవంటి మహాత్ముడైన జ్ఞాని తన కాలంలో ఎవరూ లేరనే కొఱతతో శ్రీకృష్ణుడు ఉన్నాడని తెలుస్తున్నది. ఈ విధంగా ఎవరూ తనను యథాతథంగా తెలియలేకుండా ఉండడానికి గల కారణాన్ని, వీరిలో కొందఱు 16వ శ్లోకంలో చెప్పినట్లు తన భక్తులై ఏవిధంగా పరిణమిస్తున్నారు? అనే విషయాన్ని 27, 28 శ్లోకాలలో శ్రీకృష్ణుడు వివరించాడు. ఈ రెండు శ్లోకాలలోను, వాటి భాష్యంలోను పుణ్యాపాపలక్షణం చూపబడింది. ఆ శ్లోకాల వ్యాఖ్యానంలో ఇది చాలా విస్తృతంగా నిరూపించబడింది. "పుణ్యంతో పాపాన్ని కొంచెం కొంచెంగా పోగొట్టుకొన్నవారు తమ తమ పుణ్యంలోని తారతమ్యాలకు తగినట్లు ఐశ్వర్యాన్ని కాని, కైవల్యాన్ని కాని, పరమపురుషుని కాని పొందాలని కోరి, ఆ నిశ్చయంతో భక్తి యోగాన్ని

అనుష్ఠిస్తారు- అని ఈ రెండు శ్లోకాల సారార్థం. శాస్త్రాలను అనుసరించి శబ్దాదివిషయాలను కోరి చేయబడే ప్రయత్నాలు పుణ్యాలు అని, శాస్త్రాలకు విరుద్ధంగా ఆ విషయాలను కోరి చేసే ప్రయత్నాలు పాపాలు అని చెప్పబడుతున్నాయి. ఆత్మను కాని, పరమాత్మను కాని కోరి చేయబడే కర్మజ్ఞానభక్తి యోగాదులైన ప్రయత్నాలు పుణ్యపాపాలు అనబడవు. మోక్షసాధనాలు అనే కోటిలోనికి చేరుతాయి ఇవి- అనే శాస్త్రమర్మం ఈ రెండు శ్లోకాలవల్ల వ్యక్తమవుతున్నది. అందువల్లనే కైవల్యార్థికి శబ్దాదివిషయాలలోని ఆసక్తివల్ల కల్గిన పుణ్యపాపాలు తొలగిన తరువాత, తన ఆశకు అనుగుణంగా అనుష్ఠించే మోక్షసాధనంతో అతడు కైవల్యమోక్షాన్ని పొందుతున్నాడు- అని, పరమపురుషుని పొందాలని కోరేవాడు తన కోరికకు అనుగుణంగా అతడు అనుష్ఠించే మోక్షసాధనంతో పరమపురుషుని పొందుతున్నాడని ఏర్పడుతున్నది. 16వ శ్లోకభాష్యంలో **"ప్రతిపత్తివైశేష్యాత్"** అని పుణ్యంలోని తారమత్యంతో ఏర్పడిన ఆశ లోని (కోరికలోని) తారతమ్యాన్ని అనుసరించి వీరి ఫలంలో తారతమ్యం ఏర్పడుతున్నది- అని చెప్పబడింది. ఎనిమిదవ అధ్యాయం అవతారికలోను ఉపాసకుల మూడు విధాలైన విభాగాన్నిగూర్చి చెప్పేటపుడు భాష్యకారులు. **"ప్రతిపత్తివైశేష్యాత్"** అని మళ్ళీ ఇంకొకసారి ప్రయోగించడం కూడా గమనార్హం. పుణ్య పాపాలను వివరించే ఈ రెండు శ్లోకాలలోను, ఆ పుణ్య పాపాలు సత్త్వాది గుణమయాలైన విషయాలను కోరడంవల్ల ఏర్పడేవి- అని భాష్యకారులు తెలిపారు. దీనివల్ల పుణ్యంలోని హెచ్చు తగ్గులవల్ల కల్గిన కోరికలలోని హెచ్చు తగ్గుల కారణంగా అన్ని కర్మలు తొలగి, మోక్షంలోను, సత్త్వాదిగుణాలలోని అభినివేశంవల్ల ఏర్పడిన అన్ని కర్మలు తొలగిన తరువాత ఆత్మ పరమాత్మ లను గూర్చిన కోరికలోని తారమత్యంవల్ల క్రమంగా ఆత్మానుభవమనే నీచమైన మోక్షం, పరమాత్మానుభవమనే గొప్ప మోక్షం కల్గుతాయని తెలుస్తున్నది. ఇదే రీతిలో మోక్షానందంకోసం తాను ప్రయత్నించే ఉపాసక జ్ఞాని **"యథోపాసన ఫలమ్"** (ఉపాసనకు అనుగుణంగానే ఫలం సిద్ధిస్తుంది) అనే తత్క్రతున్యాయంతో తను ఆశించిన ఆనందానికి తగినట్లు పరమపురుషుని అనుభవించే స్వార్థమోక్షాన్ని పొందుతున్నాడు- అనే విషయం,



భక్తిని సాధనంగా గ్రహించకుండా, స్వయం ప్రయోజనంగా గ్రహించి, భగవానునే ఉపాయంగా గ్రహించే మహాత్ముడైన జ్ఞాని అతని కోరికను అనుసరించి భగవానుని ఆనందానికి తగిన మోక్షాన్ని పొందుతున్నాడని సులభంగా వ్యక్తమవుతుంది. వీటినిబట్టి **"సర్వధర్మాన్ పరిత్యజ్య"** అనే చరమశ్లోకంలోని పూర్వార్ధానికి "మోక్షాన్ని పొందడానికి ఉపాయంగా తనచే గీతలో ఉపదేశింపబడ్డ అన్ని ఉపాయాలను సవాసనగా విడచి, తనను ఒక్కని మాత్రమే ఉపాయంగా గ్రహించాలి'' అనేదే శ్రీకృష్ణుని మనస్సులోని ముఖ్యమైన అభిప్రాయం - అని వ్యక్తమవుతున్నది.

కనుక, గీతలో పైపైన గమనించినపుడు కర్మ-జ్ఞాన- భక్తి యోగాలను మోక్షం పొందడంకోసం సాధనాలుగా విధింపబడినట్లు తోచినా, జాగ్రత్తగా గమనిస్తే ఫలప్రద సాధనం అయిన భగవానుడే, తన ప్రయత్నాలనుండి విరమించి అతనినే ఫలకారణం అయిన ఉపాయంగా గ్రహించేవారికి ఉపాయాంతరసాధనంలో తానే నిలిచి, నిర్హేతుకంగా మోక్షాన్ని అనుగ్రహిస్తున్నాడు- అని స్ఫుటమవుతున్నది.

**"తత్త్వ మసి", "అహం బ్రహ్మాస్మి"** మొదలైన మహావాక్యాల అర్థాలను తెలిసికోవడంవల్లనే జీవుడు నిర్గుణబ్రహ్మ కావడం అనే మోక్షం సిద్ధిస్తుందని - అని అద్వైతులు హితాన్ని వర్ణిస్తారు. దీనికి గీతలో ఎక్కడ చోటు? అన్నది తెలియదు.

## భగవద్గీతలో పురుషార్థస్వరూపం

"జీవుడు బ్రహ్మ కావడమే మోక్షం -పురుషార్థం'' అని అద్వైతుల మతం. అయితే, దీనికి గీతలో ఎక్కడా చోటు కన్పించదు. పలు గీతాశ్లోకాలు దీనికి విరుద్ధంగా కూడా ఉన్నాయి. గీతను ప్రారంభించేటపుడే - **"న త్వేవాహమ్"** అనే శ్లోకంలో **'న చైవ న భవిష్యామః'** అని అంటూ జీవులందఱు రాబోయే కాలంలోకూడా లేకుండా పోవడం అనేది లేదు- అని అనడంవల్ల మోక్షంలోను జీవుల భేదం బలపఱచబడింది. గీతలోని మొదటి షట్కంలో కర్మజ్ఞాన యోగాలను ఆత్మానుభవమనే మోక్షానికి సాధనంగా శ్రీకృష్ణుడు పలికాడు.

ఆఱవ అధ్యాయంలో ఆ ఆత్మానుభవరూపం అయిన మోక్షాన్నిగూర్చి పలికేటపుడు **"యుంజన్నేవం సదాఽత్మానం యోగీ నియతమానసః, శాంతిం నిర్వాణపరమాం మత్ సంస్థా మధిగచ్ఛతి'** (గీత- 6-1-5) (యోగాభ్యాస్యాన్ని చేసేవాడు ఈ రీతిలో మనస్సును ఎల్లప్పుడు నాపట్ల లగ్నం చేసినవాడై, దీనివల్ల నిశ్చలమైన మనస్సును కలవాడై, నాయందే ఉన్నది, శరీరమోక్షంయొక్క పర్యంతసీమ అయినది అయిన షడూర్మల శాంతిని పొందుతున్నాడు) అని మరణం, పుట్టుక, వ్యాధి, ముసలితనం, మనోవ్యాధి, కర్మలు మొదలైనవానిని, వాటికి కారణం అయిన ప్రాకృత శరీరాన్ని పోగొట్టుకొని, తనకు సమానం అయిన స్థితిని అతడు మోక్షంలో పొందుతాడని చెప్పాడే తప్ప, పరమాత్మ అనే తానుగా కాగలడని చెప్పలేదు. 44వ శ్లోకంలో ఆ కైవల్యనిష్ఠునకు ఫలాన్ని చెప్పేటపుడు కూడా **"శబ్దబ్రహ్మ అతివర్తతే"** (శబ్దబ్రహ్మ అనబడే ప్రకృతిని దాటుతున్నాడు) అని, 45వ శ్లోకంలో **"యాతి పరమాం గతిమ్"** (గొప్ప గతి అయిన ఆత్మప్రాప్తిని పొందుతున్నాడు) అని, ప్రకృతి మండలాన్ని దాటి, ఆత్మానుభవాన్ని పొందుతున్నాడని చెప్పాడే తప్ప, పరమాత్మ కాగలడని అనలేదు. 14వ అధ్యాయంలోకూడా తన ఆత్మను పొంది అనుభవించడమనే ఈ కైవల్యమోక్షాన్నిగూర్చి చెప్పేటపుడు మొదటి శ్లోకంలో **"పరాం సిద్ధి మితో గతాః"** (తమ పరిశుద్ధాత్మ స్వరూపాన్ని పొందడమనే గొప్ప సిద్ధిని పొందుతారు) అని, రెండవ శ్లోకంలో **"ఇద జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః, సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ"** (చెప్పబోయే ఈ జ్ఞానాన్ని పొంది, నాతో సామ్యాన్ని పొందినవారై, వారు ఇక్కడ సృష్టికాలంలో సృష్టింపబడడంలేదు; ప్రళయకాలంలో నశించడం లేదు) అని అంటూ మోక్షంలో వీరికి తనతో సామ్యమే కల్గుతుందని ఘోషింపబడిందే తప్ప పరమాత్మగా కాగలరని చెప్పబడలేదు.

ఆఱవ అధ్యాయంలోని చివరిది అయిన 47వ శ్లోకంలో కూడా తనను పొందాలని కోరి భక్తియోగాన్ని అనుష్ఠించేవాడు ముందు పల్కిన కైవల్యనిష్ఠునికంటే గొప్పవాడు అని జీవభేదాన్నే భగవానుడు తెలిపాడు. భక్తియోగం ద్వారా తనను పొందాలని కోరే ఆ ఉపాసకునకు కలిగే ఫలాన్నిగూర్చి



తెలిపేటపుడు కూడా **"మా మేవైష్యసి"** (9-34, 18-65) (నన్నే పొందుతావు) అని అంటూ ఆత్మ-పరమాత్మల భేదాన్నే మోక్షంలోనూ చూపాడు. శరణాగతిని విధించే చరమశ్లోకంలోను 'నేను నిన్ను అన్ని పాపాలనుండి విడుదల చేస్తాను, శోకించకు'' అని సర్వపాపవిమోచనాన్ని ఫలంగా చెప్పాడే తప్ప, జీవుని బ్రహ్మగా కాగలడని చెప్పలేదు. ఈ రీతిలో ఆదినుండి అంతంవరకు అద్వైతులు పలికే జీవ బ్రహ్మైక్యం గీతలో ఎక్కడా చెప్పబడలేదు - అని, దానికి విరుద్ధంగా భేదమే చెప్పబడింది అనే విషయం గ్రహించదగినది.

గీతలో చిత్-అచిత్-ఈశ్వరులనే మూడు తత్త్వాలు చెప్పబడ్డాయి అనేది పూర్వోక్తమే. ఆ మూడు తత్త్వాలతో సంబంధాన్ని కల్గిన మూడు పురుషార్థాలు గీతలో చెప్పబడ్డాయి. జ్ఞానం లేని వస్తువు అయిన అచిత్తును అనుభవించడం ఐశ్వర్యపురుషార్థం అవుతుంది. ఈ అచిత్తుయొక్క సంబంధం తొలగిన చిత్తు అయిన తన ఆత్మను తానే అనుభవించడం కైవల్యపురుషార్థం. ఈశ్వరుని అనుభవించడం చాలా గొప్ప మోక్షపురుషార్థం. ఈ మూడు పురుషార్థాలు ఏడవ అధ్యాయంనుండి ప్రారంభించి గీతలో పలు శ్లోకాలలో వివరింపబడ్డాయి. **"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!'** (గీత- 8-16) (అర్జునా ! బ్రహ్మాండంలో ఉండే బ్రహ్మలోకం వరకు గల అన్ని లోకాలు నశించేవి) అని గీతలో ఐశ్వర్యపురుషార్థం నశించే స్వభావాన్ని కల్గినది- అని చెప్పబడింది. నశ్వరం అయిన అచిత్తుయొక్క అనుభవం అయినందువల్ల అది నశించేది అనేది చెప్పనక్కఱలేకుండానే తెలుస్తుంది. ఆత్మయొక్క అనుభవం, పరమపురుషుని అనుభవం అచిత్ సంబంధం పూర్తిగా పోయిన తరువాతనే పరిపూర్ణంగా కల్గుతుంది కనుక, అవి సూక్ష్మశరీరం తొలగిన తర్వాత విరజానదికి ఆవలితీరంలో ఉండే పరమపదంలోనే కల్గుతుంది- అనే విషయం వ్యక్తంగానే తెలుస్తుంది. శాస్త్రాలవల్లకూడా వ్యక్తమవుతుంది. గీతలో 6, 7, 8 మొదలైన అధ్యాయాలలో కైవల్యాన్ని గూర్చిన గీతాశ్లోకాలను, శ్రీరామానుజులవారి గీతాభాష్యాన్ని పరిశీలించినపుడు కైవల్యానుభవం ప్రకృతి మండలానికి ఆవలివైపున అనుభవింపబడే, న్యూనంగా పరిగణింపబడే ఒక మోక్షం- అని స్పష్టంగా తెలుస్తుంది. ప్రారబ్ధకర్మ తొలగేవరకు ఇతడు ఆ మోక్షాన్నే కోరి,

దానికి తగిన సాధనాన్ని అనుష్ఠిస్తే, ఇతని కోరికకు అనుగుణంగా భగవానుడు ఆ ఆత్మానుభవాన్ని అనుగ్రహిస్తాడు- అని, ప్రకృతిమండలానికి ఆవలి వైపున మోక్షసాధనం ఏదీ అనుష్ఠించే అవకాశం లేనందువల్ల, ఈ ఆత్మానుభవం స్థిరమైనదై కనుక, పరమపురుషానుభవాన్ని ఇతనికి ఏనాటికీ లభించనీయకుండా చేస్తుందనే విషయం స్పష్టం. అందువల్లనే ఇది ఆత్మమాత్రానుభవమని, కేవలాత్మానుభవమని, కైవల్యానుభవమని చెప్పడుతున్నది. ఆచిదనుభవం అయిన ఐశ్వర్యానుభవంలో కూడా అప్రధానంగా ఆత్మానుభవం, పరమాత్మానుభవం కలుగవచ్చు కనుక, అది అచిన్మాత్రానుభవమని చెప్పబడడంలేదు. పరమమోక్షాన్ని పొంది ఈశ్వరుని అనుభవించేటపుడు కూడా అతని విభూతిరూపంలో చిదచిత్తుల అనుభవం కలుగవచ్చు కనుక, అదికూడా ఈశ్వరమాత్రానుభవం అని చెప్పబడడం లేదు. మిగిలిన అనుభవాలు ఏవీ ఏమాత్రం లేనందువల్ల కైవల్యానుభవం ఒక్కటే ఆత్మమాత్రానుభవమని చెప్పబడుతున్నదని గ్రహించాలి. ఈ విధంగా అనిత్యం అయినందువల్ల ఐశ్వర్యానుభవాన్ని, నిత్యంగా భగవదనుభవాన్ని లేకుండా చేసివేస్తుంది కనుక కైవల్యానుభవం పరిహరించదగినది అని, ఆనందరూపమై, స్థిరమై, అంతు లేనిదైన భగవదనుభవమే గ్రహించదగినది, కోరదగినది- అని గీతలో తెలుపబడింది.

ఇక, ఈ భగవదనుభవానికి సాధనంగా విధింపబడే భక్తినిగూర్చి కొంచెం విచారింపబడుతున్నది. తొమ్మిదవ అధ్యాయంనుండి ప్రారంభించి గీతలో పలు శ్లోకాలలో సాధనభక్తి తానే పురుషార్థంగా ఉండే స్వయం ప్రయోజనభక్తిగా పరిణమించాలి అన్నదే తన అభిపా్రయం అనేది శ్రీకృష్ణుడు అక్కడక్కడ తెలిపాడు.

తొమ్మిదవ అధ్యాయంలోని 13వ శ్లోకంలో మహాత్ములైన జ్ఞానుల మహిమను వివరించేటపుడు **"భజంత్యనన్య మనసః"** అనే పదాలకు **"మత్ప్రియత్వాతిరేకేణ మద్భజనేన వినా మనసశ్చ, ఆత్మనశ్చ, బాహ్యకరణానాం చ ధారణ మలభమానాః మద్భజనైకప్రయోజనా భజంతే"** (నేనే వారికి చాలా ప్రియంగా ఉండడంచేత, నా పట్ల ప్రేమ కల్గి ఉండకపోతే తమ మనస్సును,



ఆత్మస్వరూపాన్ని, బాహ్యేంద్రియాలను ధరించలేక, నా భక్తినే స్వయంప్రయోజనంగా కల్గి, దానిని మోక్షోపాయంగా భావించకుండా భజిస్తున్నారు) అని భగవద్రామానుజులు వివరించడంవల్ల, ఉపాసక జ్ఞాని స్వయంప్రయోజన భక్తినిష్ఠుడుగా పరిణమించాలి- అన్నదే గీతాచార్యుని అభిప్రాయం అని తెలుస్తున్నది.

తొమ్మిదవ అధ్యాయంలోని 22, 26, 27, 30 శ్లోకాలలో ఈ అర్థమే బలపఱచబడింది. **"మన్మనా భవ"** అని ఆరంభం అవుతున్న చివరి శ్లోకంలో **"యుక్త్వైవమ్ ఆత్మానం మత్పరాయణః మామేవైష్యసి"** (ఈ విధంగా మనస్సును పరిణమింప జేయడంద్వారా నన్నే గొప్ప ప్రాప్యంగా, ప్రాపకంగాను కలవాడవై నన్నే పొందు) అనే ఉత్తరార్ధంవల్ల సాధనభక్తి విడిచిపెడితే జీవించలేని అవధికి స్వయం ప్రయోజనభక్తిగా పరిణమించాలి- అనేదే భగవానుని అభిప్రాయం- అని తెలుస్తున్నది. ఇక్కడ భాష్యంలో **"మత్పరాయణః - మయా వినా ఆత్మధారణాసంభావనయా మదాశ్రయ ఇత్యర్థః"** (నన్ను విశ్లేషిస్తే ప్రాణాలు నిలువలేని అవధికి నన్నే పరమప్రాప్యంగా (గొప్ప ఫలంగా) కలవాడు) అనేది **"మత్పరాయణః"** అనే శబ్దంయొక్క తాత్పర్యం - అని భాష్యంలో అనుగ్రహించడంవల్ల, మోక్షసాధనమైన భక్తి క్షణకాలం విడిచి ధరించ లేని పరమభక్తిగా పరిణమించాలి- అనేదే భగవానుని అభిప్రాయం అని తెలుస్తున్నది.

పదవ అధ్యాయంలోని 9, 10, 11 శ్లోకాలతో తన ఐశ్వర్యం, కల్యాణగుణాలు- మొదలైనవానిని అనుసంధించడంవల్ల భక్తి పెరిగి, ఉచ్చదశలో స్వయంప్రయోజనం అయిన భక్తిగా పరిణమిస్తుందని పల్కి, అటువంటి భక్తిని కల మహాత్ముల గొప్పతనాన్ని భగవానుడు వివరించాడు. 9వ అధ్యాయంలో **"తుష్యంతి చ రమంతి చ"** అనే పదాల స్వారస్యాన్ని **"అనన్యప్రయోజనేన తద్వచనేన తుష్యంతి"** అని అంటూ భగవద్భాష్యకారులు అనుగ్రహించడాన్ని బట్టి, శ్రీకృష్ణుడు మోక్షఫలంలో గుఱిని కల ఉపాసకభక్తుడు కూడ అనన్యప్రయోజన భక్తునిగా పరిణమించాలనే అభిప్రాయాన్ని కల్గి ఉన్నాడు- అని భాష్యకారుల అభిప్రాయమని తెలుస్తున్నది. పదవ శ్లోకంలో, ఈ విధంగా స్వయంప్రయోజన భక్తిగా పరిణమించగానే "ఆ భక్తునకు నన్ను పొందడానికి

ముందు ఏర్పడే పరజ్ఞానం అనబడే మిక్కిలి స్పష్టమైన సాక్షాత్కారాన్ని నేనే నిర్హేతుకంగా సంతోషంతో అనుగ్రహిస్తాను'' అని అన్నాడు. **"ప్రీతిపూర్వకం భజతామ్"** అని అన్వయించకుండా, **"ప్రీతిం పూర్వకం దదామి"** అని అన్వయించి భాష్యంలో అర్థం గ్రహించడంవల్ల, ఇటువంటి భక్తుడు పరమాత్మపట్ల చూపే ప్రీతికంటే అతని విషయంలో భగవానుడు చూపే ప్రీతి చాలా ఎక్కువగా ఉంటుంది- అని తెలుపబడింది. **"దానమ్"** అనే అర్థాన్ని కల ధాతువునుండి పుట్టిన **"దదామి"** అనే పదంవల్ల భగవానుడు ఇతనికి ప్రయోజనాన్ని నిర్హేతుకంగా అనుగ్రహిస్తాడు - అని ఏర్పడుతున్నది. ఈ విధంగా అంతిమస్మృతివరకు స్వయంప్రయోజన భక్తిగా పరిణమించని భక్తిని కల ఉపాసకజ్ఞాని విషయంలో ఆ ఉపాసనా ఫలంగా అంతిమస్మృతిలో పరజ్ఞానపరమభక్తులను కల్గించి, అతడు కోరే స్వార్థమోక్షాన్ని భగవానుడు అనుగ్రహిస్తాడని కూడా దీనివల్ల తేలుతున్నది.

**"తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః, నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"** (అనన్య ప్రయోజన భక్తినిష్ఠులపట్ల కృపతోనే వారి మనస్సుకు విషయం అయినవాడనై, నా కల్యాణగుణాలను ఆవిష్కరించి, నా విషయకమైన, జ్ఞానం అనే గొప్పగా ప్రకాశించే దీపంతో జ్ఞానానికి విరోధి అయిన, పూర్వకర్మలవల్ల ఏర్పడిన- శబ్దాదిలౌకికవిషయ ప్రావణ్యరూపం అయిన తమస్సును, అంటే - అజ్ఞానాన్ని పోగొడతాను) అని గీతలో 10వ అధ్యాయం 11వ శ్లోకంలో పరజ్ఞానానికి ఆటంకం అయిన అజ్ఞానతమస్సును ఆ స్వయంప్రయోజన భక్తినిష్ఠులకు తన నిర్హేతుకకృపతో జ్ఞానం అనే దీపాన్ని వెలిగించి పోగొడతానని అన్నాడు. **"అనుకంపాయై"** అనే పదప్రయోగాన్ని చేయకుండా, **"అనుకంపార్థమ్"** అనే **"అర్థ"** శబ్దాన్ని ప్రయోగించడంవల్ల, **"ఏవ"** అనే పదప్రయోగం చేయడం వల్ల తన ప్రయోజనంగా భావించి అనుగ్రహిస్తాడు - అని తెలుస్తున్నది. ఉపాసకజ్ఞాని తన ఉపాసనతో లౌకికవిషయ ప్రావణ్యాన్ని పోగొట్టుకొన్న తరువాత ఉపాసనఫలంగా అతనికి అంతిమస్మృతిలో పరజ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు- అని, మహాత్ముడైన జ్ఞానికి తన భక్తిని స్వయంప్రయోజనంగా భావించిన ఆ జన్మలోనే నిర్హేతుకంగా విషయప్రావణ్యాన్ని పోగొట్టి పరజ్ఞానాన్ని



కల్గించి, మోక్షాన్ని అనుగ్రహిస్తాడని తెలుపడంద్వారా ఆ ఇద్దరికీ ఉండే భేదం తెలుపబడింది.

11వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు అర్జునునకు విశ్వరూపాన్ని చూపించిన తరువాత, చివరలో ఉండే 53, 54, 55వ శ్లోకాలతో "వేదాలు, తపస్సు, దానం, యాగాలు మొదలైనవాటితో నన్ను ఈ విధంగా దర్శించడం వీలు కాదు. స్వయంప్రయోజన రూపమైన భక్తితోనే ఈ విధంగా నన్ను తెలిసికొని పొందవచ్చు'' అని అన్నాడు. **"కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" (7-3)** అని ఏడవ అధ్యాయంలోని ఆరంభంలో చెప్పబడ్డ మహాత్ముడైన జ్ఞానినే ఇక్కడ **"అనన్యయా భక్త్యా తత్త్వేన జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం చ శక్యః" (54)** అని స్వయంప్రయోజన భక్తితోనే జ్ఞానదర్శన ప్రాప్తులను యథాతథంగా పొందుతాడని భగవానుడన్నాడు. "మన ప్రయత్నంతో భగవానుని పొందవచ్చు అనే జ్ఞానం తత్త్వజ్ఞానం కాబోదు. స్వప్రవృత్తినివృత్తి అనే ప్రపత్తితో పొందవచ్చు అని తెలియడమే తత్త్వజ్ఞానం. ఉపాసనఫలంగా అంతిమస్మృతిలో పొందే దర్శనం తత్త్వదర్శనం కాదు. స్వయంప్రయోజన భక్తితో అంతిమస్మృతికి ముందే కలిగే పరజ్ఞానమైన దర్శనమే తత్త్వదర్శనం అవుతుంది. ఉపాసనఫలంగా పొందే స్వార్థమోక్షం తత్త్వప్రవేశం అనబడదు. స్వయంప్రయోజనభక్తితో పరజ్ఞాన పరమభక్తులు కలిగి, నిర్హేతుకంగా పొందే పరార్థానుభవ కైంకర్యాలే తత్త్వప్రవేశం కాగలవు''- అనే అరుదైన రహస్యార్థం ఇక్కడ శ్లోకంలో ఉండే **"తత్త్వేన"** అనే పదాన్ని **"జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుమ్"**- అనే మూడు పదాలతో కలిపి అర్థం చెప్పినపుడు లభిస్తుంది. 53వ, 54వ శ్లోకాలు **"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, య మేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూమ్ స్వామ్" (కఠ- 2-23)** (ఈ పరమాత్మ భక్తి లేని శ్రవణమననధ్యానాదులతో పొందడానికి వీలయినవాడు కాడు. భక్తిని కల ఎవనిని ఈ పరమాత్మ వరిస్తున్నాడో అతనికే ఈ పరమాత్మ తన స్వరూపాన్ని దర్శింపజేస్తున్నాడు) అనే ఉపనిషద్వాక్యానికి వివరణమై, పరగతస్వీకార నిష్ఠను, స్వయంప్రయోజనభక్తిని వివరిస్తున్నవి. **"ఉపపత్తేశ్చ" (బ్ర.సూ-3-2-34)** అనే సూత్రంలోని భాష్యంలో "భగవానుడే

ఉపాయం'' అనే అర్థానికి ప్రమాణంగాను, శ్రీభాష్యప్రారంభంలోను, ఈ శ్లోకభాష్యంలోను -''అంతు లేని భక్తిని కలవానికి భగవానుడు తనను దర్శింపజేస్తాడు'' అనే అర్థానికి ప్రమాణంగాను ఈ మంత్రాన్ని భగవద్భాష్యకారులు ఉట్టంకించడం స్వయంప్రయోజన భక్తినిష్ఠుడైన పరగతస్వీకారనిష్ఠుడే ఈ మంత్రంలో **"యమ్"** అనే శబ్దానికి ముఖ్యార్థభూతుడు కనుక, విరుద్ధం కాదు. 55వ శ్లోకంలోని భాష్యంలో **''మద్భక్తః అత్యర్థమత్ప్రియత్వేన మత్కీర్తన స్తుతిధ్యాన అర్చన ప్రణామాదిభిః వినా ఆత్మధారణ మలభమానో మదేకప్రయోజనతయా య స్సతతం తాని కరోతి స మద్భక్తః"** (నా విషయంలో అంతు లేని ప్రేమను కలవాడు కావడంచేత నన్ను సంకీర్తనం చేయడం, స్తుతించడం, ధ్యానించడం, అర్చించడం, నమస్కరించడం - మొదలైన వానినిచేయకుండా తన ప్రాణాన్ని ధరించలేనివాడై, నన్నే ప్రయోజనంగా కలవాడై, ఎల్లప్పుడు నా ఆరాధనరూపాలుగా కర్మలను అనుష్ఠించేవాడు నా భక్తుడు) అని **"భక్త"** శబ్దాన్ని భాష్యకారులు వివరించడంవల్ల, ఈ మూడు శ్లోకాలలో చెప్పబడిన వాడు స్వయంప్రయోజన భక్తినిష్ఠుడే - అని వ్యక్తమవుతున్నది.

పన్నెండవ అధ్యాయంలో భగవానుడు 6,7 శ్లోకాలలో తనను ఉపాసించేవారి గొప్పతనాన్నిగూర్చి పలికేటపుడు **'అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే',** (వేఱు ఫలాన్ని ఆశించని యోగంతో నన్నుగూర్చి ధ్యానం మొదలైనవానిని చేస్తూ ఉపాసిస్తున్నారు) అని సూచించాడు. ఇక్కడ భాష్యం అనుగ్రహిస్తూ భాష్యకారులు **'అనన్యేనైవ యోగేన- అనన్యప్రయోజనేన యోగేన మామ్ ధ్యాయంత ఉపాసతే- ధ్యానార్చనప్రణామస్తుతికీర్తనాదీని స్వయమేవాత్యర్థప్రియాణి ప్రాప్యసమాని కుర్వంతో మా ముపాసత ఇత్యర్థః" (అనన్యేనైవయోగేన-** అనేది వేఱు ఫలాన్ని ఆశ పడని భక్తియోగాన్ని తెలుపుతుంది. **"మాం ధ్యాయంత ఉపాసతే"** అనే ప్రయోగం- ధ్యానార్చన ప్రణామస్తుతి సంకీర్తనాదులను చాలా ప్రియంగా ఉండడంవల్ల (మోక్షాన్నికూడా వీటికి ఫలంగా గ్రహించకుండా) స్వయంప్రయోజనంగా అనుష్ఠిస్తూ నన్ను ఉపాసిస్తున్నాడు- అని అర్థాన్ని ఇస్తుంది) అనే అనుగ్రహించడంవల్ల భక్తియోగం



మోక్షసాధనంగా విధింపబడినా, మోక్షాన్ని దీనికి ఫలంగా భావించకుండా స్వయంప్రయోజనంగా భావించి అనుష్ఠించడమే భగవానునకు చాలా ప్రియం అని, ఉపాసకుని స్వయంప్రయోజన భక్తినిష్ఠుడైన సిద్ధోపాయనిష్ఠునిగా చేయడంలోనే భక్తివిధిశాస్త్రానికి దృష్టి అని తెలుస్తున్నది. ఏడవ శ్లోకంలో **"తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్, భవామి న చిరాత్"** (వారు నన్ను పొందడంలో అడ్డం కనుక) ఆత్మనాశాన్ని కల్గించే సంసారం అనే సముద్రంనుండి నేను త్వరలోనే ఉద్ధరిస్తాను) అని ఉపాసనభక్తి అనేది స్వయంప్రయోజన భక్తిగా పరిణమించింది అంటే, త్వరలోనే, అంటే- ఆ జన్మయొక్క చివరలో సంసారం తీరుతుంది- అని తెలుపబడింది.

పద్దెనిమిదవ అధ్యాయంలో 45వ శ్లోకంనుండి ప్రారంభించి గీతలో ఇంతవరకు చెప్పినదానిని అంతటినీ సంగ్రహంగా శ్రీకృష్ణుడు మళ్ళీ తెలిపాడు. 45వ శ్లోకంనుండి 54వ శ్లోకంవరకు ఆత్మనుగూర్చిన యథార్థజ్ఞానాన్ని పురస్కరించుకొని కర్మయోగాన్ని అనుష్ఠిస్తే ఆత్మధ్యానం ఏర్పడుతుంది - అని, ఆ ఆత్మధ్యానంతో ఆత్మసాక్షాత్కారం ఏర్పడుతుంది - అని, ఆ విధంగా ఆత్మస్వరూపాన్ని యథాతథంగా దర్శించిన తరువాత తన విషయమైన పరభక్తి ఏర్పడుతుందని పలికాడు. ఇది గీతలోని మొదటి షట్కంలోని అర్థసంగ్రహం. 55వ శ్లోకంలో భక్తియోగంయొక్క ఉచ్చస్థితి అయిన పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులను పొందడాన్నిగూర్చి తెలుపడంద్వారా రెండవ షట్కంలోని అర్థ సంగ్రహాన్ని పలికాడు. పరభక్తిద్వారా తన స్వరూప స్వభావాలను యథాతథంగా తెలిసికోవడం అనే పరజ్ఞానాన్ని పొందుతున్నాడు - అని, ఆ తరువాత ఆ పరమభక్తియొక్క ముదిరిన దశ అయిన పరమభక్తిని పొందుతున్నాడు అని, క్షణం అయినా తనను విడచి నిలువలేక పోవడం అనే పరమభక్తిని పొందగానే, ఆ కారణంవల్లనే అతడు ఆ జన్మలోనే మోక్షాన్ని పొందుతున్నాడు- అని శ్రీకృష్ణభగవానుడన్నాడు. **"తదనంతరం తత్త్వతః విశతే"** అనే పరజ్ఞాన- పరమభక్తులను పొందిన జన్మలోనే అతనికి యథాతథంగా భగవానుని పొందడం అనే పరమమోక్షం సిద్ధిస్తుందని పల్కడాన్ని గమనించాలి. **"కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" (7-3)** (పలు వేలమందిలో ఒకడే యథాతథంగా

తెలిసికొంటున్నాడు) అని, **"భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽ ర్జున!, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!" (18-54)** (శత్రువులను తపింపజేసే అర్జునా! నేను స్వయం ప్రయోజన భక్తితోనే ఈ రీతిలో యథాతథంగా తెలిసికోవడానికి, దర్శించడానికి, పొందడానికి తగినవాడను) అని చెప్పబడ్డ తత్త్వజ్ఞాన- తత్త్వదర్శన- తత్త్వప్రవేశాలను ఈ శ్లోకంలో **(18-55) "తత్త్వతః అభిజానాతి"** అని, **"తత్త్వతః జ్ఞాత్వా"** అని, **"తత్త్వతః విశతే"** అని అనువదించడంద్వారా ఉపాసకజ్ఞాని ఆ ఉపాసనం యొక్క ఉచ్చదశలో భగవానునే ఉపేయంగా కల్గి ఉండడంతోపాటు, ఉపాయంగాకూడా కల్గి ఉండడం అనే తత్త్వజ్ఞానాన్ని పొందుతున్నాడు- అని, దీనికి తరువాత అతనికి యథాతథంగా భగవానుని దర్శించడం అనే పరజ్ఞానం కల్గుతుంది అని, అది పరమభక్తిగా ముదిరిన (పరిణమించిన) తరువాత భగవానుని యథాతథంగా పొందడం అనే సాయుజ్యం ఏర్పడుతుందని తెలుపబడుతున్నది. ప్రారబ్ధ కర్మ ముగిసేవరకు ఈ పరజ్ఞాన- పరమభక్తులు ఉపాసకజ్ఞానికి కలుగలేదంటే, అంతిమస్మృతిలో అతని ఉపాయభక్తియొక్క ఫలంగా పరజ్ఞాన- పరమభక్తులను కల్గించి, అతనికి మోక్షాన్ని పరమాత్మ అనుగ్రహిస్తాడు అని, **"ఉపాసనానుగుణమ్ ఫలమ్"** అనే తత్క్రతున్యాయంలో అతడు పొందే పరజ్ఞాన పరమభక్తులు, మోక్షం **"తనక్కేయాక ఎనై క్కొళ్ళు మీదే"** (తిరువాయ్- 2-9-4) అనే రీతిలో పరార్థంగా ఉండకుండా, స్వార్థంగా రూపొందుతాయని తెలుస్తున్నది.

### ఈ విషయంలో పూర్వాచార్యులలో గల భిన్నాభిప్రాయాలు

భగవద్గీతలోను, మిగిలిన శాస్త్రాలలోను తత్త్వహితపురుషార్థాలను నిర్ణయించేటపుడు భగవద్రామానుజుల శిష్య- ప్రశిష్యుల మధ్యలో ప్రధానంగా రెండు విధాలైన అభిప్రాయాలు వ్యక్తం అయ్యాయి. నడాదూర్ అమ్మాళ్, శ్రుతప్రకాశికా చార్యులవారు, నమ్బిళ్ళై మొదలు మణవాళమహామునులవరకు ఉండే దివ్యప్రబంధవ్యాఖ్యాతలు మొదలైనవారి అభిప్రాయం ఇంతకుముందు తెలుపబడింది. దాని సారం ఏమంటే-



జీవునకు ఒక్కొక్క కార్యంలోను ప్రథమప్రయత్నంలో స్వాతంత్ర్యం ఉన్నదని పరాయత్తాధికరణంవల్ల తెలుస్తున్నది. కనుక ఆ ప్రథమప్రయత్నాన్ని ఉపయోగించి, తమ ఆనందంకోసం ఒక ప్రయోజనాన్ని ఆశించి అనుష్ఠింపబడే సాధనాంతరాలు అన్నీ జీవుని అత్యంతపారతంత్ర్య స్వరూపానికి విరుద్ధాలు. ఆ సాధనాలను అనుష్ఠించి మోక్షాన్నే పొందినా, తత్క్రతున్యాయంలో ఆ సాధనాలకు ఫలంగా లభించే మోక్షంకూడా తమ ఆనందానికి అనుగుణంగానే ఉంటుంది. "తన ఆనందానికి తగినట్లుగా ఆత్మను అనుభవించడమే చాలు'' అని తలచి కైవల్యాన్ని పొందాలని భావించి, దానికి అనుగుణంగా సాధనాన్ని అంతిమస్మృతి కలిగేవరకు అనుష్ఠించినవాడైతే, తత్క్రతున్యాయానుసారం కైవల్యమనే అవరమోక్షమే అతనికి నిరంతరంగా కల్గుతుంది. తమ ఆనందాన్ని కోరి భక్తిని సాధనంగా అనుష్ఠించేవారికి స్వార్థంగా భగవానుని అనుభవించడాన్ని ముఖ్యంగా కల మోక్షం లభిస్తుంది. ప్రపత్తిని ఉపాయంగా భావించి అనుష్ఠించేవారికికూడా స్వార్థమైన భగవత్కైంకర్యాన్ని ముఖ్యంగా కల్గిన మోక్షం లభిస్తుంది. భక్తినిష్ఠులకు, స్వార్థ భగవదనుభవం ప్రధానంగాను, భగవత్కైంకర్యం దానికి అంగంగాను, ప్రపత్తిని ఉపాయంగాను, అనుష్ఠించేవారికి స్వార్థ భగవత్కైంకర్యం ప్రధానంగాను, భగవదనుభవం దానికి అంగంగాను సిద్ధిస్తుంది. ముక్తిలోకూడా భగవానుని ఆనందాన్నే ఉద్దేశ్యంగా కల్గిన మోక్షానికి తాము ఒక సాధనానుష్ఠానాన్ని గ్రహించడ స్వరూపవిరుద్ధం అని తెలిసి, తాము చేసే ఆశ్రయణం (శరణాగతి) ఉపాయం అనే భావనను కల్గి ఉండకుండా, భగవానుడు తమను వరించడమే ఉపాయం అని నిశ్చయించుకొని చాతకంవలె స్వామి కరుణకోసమే వేచి ఉండే పరగతస్వీకారనిష్ఠులైన ఉత్తమశరణాగతులకు భగవానుడు నిర్హేతుకంగా పరార్థానుభవకైంకర్యరూపమైన మోక్షాన్ని అనుగ్రహిస్తాడని ఇచటి భావం.

శ్రీవేదాంతదేశికుల ఆచార్యులైన కిడాంబి అప్పుళ్ళార్‌కు, వేదాంతదేశికులకు ఈ విషయంలో అంగీకారం లేదు. శాస్త్రంలో విధింపబడినదిగా భావించి, ఋషులు అనుష్ఠించినట్లుగా చెప్పబడే భక్తియోగాన్ని స్వరూపవిరుద్ధంగా చెప్పడం, దానిఫలంగా మోక్షంలో కూడా

స్వార్థ ఫలం కల్గుతుందని అనడం సరి కాదు- అనేది వీరి అభిప్రాయం. ప్రథమప్రయత్నంలో జీవునకు స్వాతంత్ర్యం అంగీకరిస్తే, ఆ స్వాతంత్ర్యాన్ని ఉపయోగించి అనుష్ఠింపబడే సాధనాంతరాలు స్వరూపవిరుద్ధాలు - అని సిద్ధిస్తుంది కనుక, ప్రథమ ప్రయత్నంలో జీవునకు స్వాతంత్ర్యం ఉన్నదని అనడం సరి కాదు. జీవునకు పూర్వపూర్వకర్మలే ఆ తరువాత అతడు చేసే మంచి ప్రయత్నాలకు, చెడ్డ ప్రయత్నాలకు కారణ మవుతున్నాయని భావించవచ్చు. దీని మూలంగానే భగవానుని విషయంలో వైషమ్యనైర్ఘృణ్య పరిహారం- మొదలైనవి వీలవుతాయి- అని వీరు ముందు తెలుపబడ్డ, పలువురు ఆచార్యుల అభిప్రాయాన్ని తిరస్కరించారు. ఈ విధంగా "జీవునకు ప్రథమప్రవృత్తిలో స్వాతంత్ర్యం ఉన్నది. ఆ స్వాతంత్ర్యాన్ని ఉపయోగించి మోక్షంకోసం అనుష్ఠింపబడే సాధనాంతరాలుకూడా స్వరూపవిరుద్ధాలే. ఆ సాధనాంతరాల మూలంగా పొందే మోక్షంకూడా స్వార్థంగానే రూపొందుతుంది. మోక్షంలోకూడా భగవానుని ఆనందాన్నే ఉద్దేశ్యంగా కల్గి, అతని కృపనే సాధనంగా గ్రహించి, తమ వద్ద ఉన్నదానిని దేనినీ సాధనంగా భావించని ఉత్తమ ప్రపన్నులకే భగవానుడు నిర్హేతుకంగా పరార్థకైంకర్య ప్రధానమైన మోక్షాన్ని అనుగ్రహిస్తాడు'' అనేది తత్త్వహితపురుషార్థాల సిద్ధాంతాలను (మూలంగా) ప్రాతిపదికగా కల్గిన తెన్నాచార్య సంప్రదాయం. "జీవునకు ప్రథమప్రవృత్తిలో స్వాతంత్ర్యం లేశంకూడా లేదు. అందువల్ల సాధనాంతరాలు స్వరూపవిరుద్ధాలు అనే మాటకే చోటు లేదు. అందుచేత, ముక్తిలో కూడా స్వార్థం, పరార్థం - అని రెండు విధాలైన మోక్షాలు లేవు. కైవల్యం మోక్షం కాదు. చాలా గొప్పది అయిన ఐశ్వర్యం మాత్రమే'' అనే తత్త్వహిత పురుషార్థాల సిద్ధాంతాలను ప్రాతిపదికగా కల్గి దేశిక సంప్రదాయం వర్ధిల్లింది- అని తెలుస్తున్నది.

ఈ అభిప్రాయ భేదంవల్ల గీతలో పరమసారం అయిన శ్లోకంగా, శ్రీవైష్ణవులందఱిచేత గ్రహింపబడే చరమశ్లోకానికి అర్థం గ్రహించడంలో కూడా శ్రీవేదాంతదేశికులకు, మిగిలిన ఆచార్యులకు అభిప్రాయభేదం ఏర్పడింది. భట్టర్ ప్రణీతమైన అష్టశ్లోకి, పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన పరందరహస్యం, పిళ్ళైలోకాచార్యులవారి ముముక్షుప్పడి మొదలైన తెన్నాచార్య గ్రంథాలలో చరమశ్లోకంలోని అర్థం ఈవిధంగా ఉన్నది. "అనుష్ఠించడానికి వీలు కానివి, అత్యంతపారతంత్ర్యం అనే జీవస్వరూపానికి తగనివి అయిన కర్మ- జ్ఞాన, భక్తి యోగాలు మొదలైన చేతనప్రవృత్తిరూప మోక్షోపాయాలను అన్నిటిని "ఉపాయం కాని వీటిని ఉపాయం అని తలచామే!'' అనే సిగ్గుతో పూర్తిగా విడచి పెట్టి, నన్ను ఒక్కని మాత్రమే ఉపాయంగా పరిగ్రహించు. నన్ను ఉపాయంగా నీవు చేసే ఆశ్రయణం (శరణాగతి) కూడా ఉపాయమని భావించకు. ఇటువంటి నిన్ను, జ్ఞానశక్త్యాదిగుణపూర్ణుడనైన నేను, నన్ను పొందడంలో ఆటంకాలుగా ఉండే అన్ని పాపాలనుండి నిన్ను విడిపిస్తాను'' అనేది తెన్నాచార్య సంప్రదాయంలోని అర్థం.



శ్రీవేదాంతదేశికుల తాత్పర్యచంద్రిక, రహస్యత్రయసారం మొదలైన గ్రంథాలనుబట్టి చరమశ్లోకంలోని అర్థం ఈ విధంగా ఉన్నది. "కర్మజ్ఞాన యోగాలను అంగంగా కల్గిన భక్తియోగాన్ని అనుష్ఠించడంలో శక్తిని కలవాడు, ఈ జన్మలోనే మోక్షాన్ని పొందాలి- అనే త్వర లేకుండా ఉన్నందువల్ల, భక్తియోగాన్నే మోక్షోపాయంగాను, ప్రపత్తిని తదంగంగాను అనుష్ఠించాలి. ఈ విధంగా భక్తియోగాన్ని అనుష్ఠించడానికి జ్ఞానశక్తులు లేనివారిచేత, జ్ఞానశక్తులు ఉన్నా "ఈ జన్మలోనే మోక్షాన్ని పొందాలి'' అనే త్వరను కలవారిచేత ముఖ్యప్రపత్తియే అనుష్ఠించదగినది. వారికి భక్తి మొదలైన అన్ని మోక్షోపాయాలను విడచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే మోక్షోపాయంగా గ్రహించే శరణాగతిని అనుష్ఠించు. నీవు చేసే ఆశ్రయణం భగవానునకు సమానమైన ఉపాయమని భావించకు. ఈ విధంగా శరణాగతిని అనుష్ఠించిన నిన్ను నేను, నన్ను పొందడంలో అడ్డుగా ఉండే అన్ని పాపాలనుండి విడిపిస్తాను'' అనేది చరమశ్లోకార్థం. అంగప్రపత్తిని చేసేవారికి "భక్తియోగం ప్రారంభించడానికి అడ్డు అయిన పాపాలను గాని, భక్తియోగాన్ని నిరంతరం కొనసాగించడానికి అడ్డు అయిన పాపాలనుకాని తొలగించుకోవడానికి తనచే సాధ్యం కాదు- అని భావిస్తే, దాని కోసం నన్నే శరణు పొందు; ఆ పాపాలను అన్నిటినీ నీకు నేను తీరుస్తాను'' అనేది చరమశ్లోక సారం. ఈ విధంగా ఈ చరమశ్లోకం

ముఖ్యప్రపత్తిని చేసేవారికి, భక్తియోగంలో అంగంగా ప్రపత్తిని చేసేవారికి (అంగి ప్రపత్తి- అంగప్రపత్తులు) సాధారణమైనది. వారి వారికి తగినట్లు అర్థం వేఱు అవుతున్నది - అనేది శ్రీవేదాంత దేశికుల అభిప్రాయం.

దీనినిబట్టి, చేతనాచేతనవిశిష్టమైన పరబ్రహ్మం అయిన శ్రీమన్నారాయణుడే తత్వమనేది, సకలపూర్వాచార్యులు అంగీకరించిన గీతాతాత్పర్యం. హిత- పురుషార్థాల విషయంలో "దయాగుణవిశిష్టుడైన ఆ పరమపురుషుడే ఉపాయం, చేతనుని ప్రయత్నాలు ఉపాయం కావు. ఆ పరమపురుషుని ఆనందానికి తగిన కైంకర్యమే పరమపురుషార్థం. తన ప్రయత్నం ఉపాయం అనే అభిప్రాయాన్ని కలవారు పొందే స్వార్థ మోక్షం, కైవల్యమోక్షం- పరమపురుషార్థాలు కావు- అనేది తెన్నాచార్య సంప్రదాయం. భక్తి, ప్రపత్తి మోక్షానికి సాధ్యోపాయాలు. భక్తులు- ప్రపన్నులు అనే ఇద్దరికి భగవానుడు మోక్షంలో ఒకే విధమైన పురుషార్థాన్ని అనుగ్రహించే సిద్ధోపాయం. మోక్షంలో స్వార్థ- పరార్థభేదం లేదు. కైవల్యం మోక్షం కాదు. సంసారమండలంలో అనుభవింపబడే ఒక గొప్ప ఐశ్వర్యవిశేషం మాత్రమే" అనేది శ్రీవేదాంత దేశికుల అభిప్రాయం- అని వ్యక్తమవుతున్నది.

## భగవద్గీతలో పరమైకాంతిస్వరూపం

భగవద్గీతకు మొట్టమొదటగా భగవద్యామునులు 32 శ్లోకాలను కల గీతార్థ సంగ్రహమనే గ్రంథంలో వివరణాన్ని అనుగ్రహించారు. దానిని ఆధారంగాచేసికొని భగవద్రామానుజులు తమ గీతాభాష్యాన్ని వెలయించారు. "కర్మజ్ఞాన యోగాలను అంగంగా కల్గిన భక్తియోగంతో భగవానుని చేరడం అనే మోక్షాన్ని చేతనుడు పొందుతున్నాడు" అన్నది గీతాభాష్యంలో స్పష్టంగా మనకు కన్పించే అర్థం. "ఈ భక్తియోగం ప్రారబ్ధకర్మ ముగిసేవరకు, అది పలు జన్మలలో అనుష్ఠింపబడినా, పూర్తికాదు, ఆ ప్రారబ్ధకర్మ ముగిసే జన్మలో భక్తియోగం పూర్తి చెంది, ఉపాసకునకు అంతిమస్మృతి కల్గి, అతడు మోక్షాన్ని పొందుతున్నాడు" అని పూర్వాచార్యులు అనుగ్రహించారు.

అయితే, గీతాభాష్యాన్ని పరిశీలించి చూస్తే, ఉపాసకజ్ఞాని తన



అత్యంతపారతంత్ర్యరూపాన్ని గూర్చిన అనుసంధానంతోను, త్రివిధపరిత్యాగంతోను భక్తియోగాన్ని అనుష్ఠించేటపుడు "భగవానుడు ప్రాప్యం, భక్తియోగం అతనిని పొందించే ఉపాయం" అనే భావన మాఱి, "భగవానుడే ప్రాప్యంగాను, ప్రాపకంగాను, ధారక- పోషక- భోగ్యాది సమస్తంగా ఉన్నాడు" అనే తత్త్వజ్ఞానం అతనికి కల్గుతుంది. అని, "ఈ జ్ఞానం కలుగగానే ప్రారబ్ధకర్మం మిగిలి ఉన్నా, అతడు ఆ జన్మ చివరలోనే మోక్షాన్ని పొందుతున్నాడు" అని గీతాచార్యుడు, గీతాభాష్యకారులు భావించారు- అని తెలుస్తున్నది. గీతలోని ఏడవ అధ్యాయంలో **"కశ్చిన్మాం వేత్తి తత్త్వతః"** (ఉపాసకులు పలువేలమందిలో ఎవడో ఒకడే యథాతథంగా తెలిసికొంటున్నాడు) అని పల్కి, దానిని వివరించే 19వ శ్లోకంలో "పలు జన్మలు గడచిన తరువాత చివరి జన్మలో ఉపాసకజ్ఞానికి, "నేనే ప్రాప్యం ప్రాపకం మొదలైన అన్నీ అనే జ్ఞానం కలుగుతుంది" అని, "అటువంటివాడు చాలా దుర్లభుడు" అని గీతాచార్యుడు, భాష్యకారులు అనుగ్రహించడం గమనార్హం. తరువాతి అధ్యాయాలలోని పలు శ్లోకాలలో "ఈమహాత్ముడైన జ్ఞానికి పరమభక్తి అనేది పరజ్ఞాన- పరమభక్తులుగా వృద్ధిచెంది "భక్తియోగం మోక్షోపాయం" అనే భావన మాఱి, "భగవానుడే మోక్షోపాయం, భక్తి స్వయంప్రయోజనం" అనే భావన కల్గుతుంది. ఈ భావన కల్గిన ఆ జన్మలోనే అతడు మోక్షం పొందుతున్నాడు" అని గీతలోను, భాష్యంలోను తెలుపబడింది. ఈ విధంగా ఉపాసకభక్తుడే స్వయంప్రయోజన భక్తినిష్ఠుడైన ప్రపన్నుడుగా పరిణమిస్తున్నందున అతనిని ఆ జన్మ చివరలోనే సంసారసముద్రంనుండి విడిపిస్తానని అంటూ, **"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్, భవామి న చిరాత్"** (12-7) (వారు నన్ను పొందడానికి ఆటంకం అయినందువల్ల ఆత్మనాశాన్ని కల్గించే సంసారం అనే సముద్రంనుండి నేను త్వరలోనే ఉద్ధరిస్తాను) అనే శ్లోకంలోని **"నచిరాత్"** అనే పదంతోను, **"భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః, తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్"** (18-55) (స్వరూపంతోను, స్వభావంతోను నేను ఎటువంటివాడనై, గుణంతోను, సంపదతోను నేను ఎటువంటివాడనై ఉన్నానో,

అటువంటి నన్ను ముందు పల్కిన పరమభక్తితో యథాతథంగా తెలిసికొని, వెంటనే పరమభక్తితో నన్ను పరిపూర్ణంగా పొందుతున్నాడు) అనే శ్లోకంలో **"తదనంతరమ్"** (వెనువెంటనే) అనే పదంతోను స్పష్టంగా తెలియజేయడాన్ని గమనించాలి.

ఈ మహాత్ముడైన జ్ఞానినే గీతార్థసంగ్రహంలో భగవద్యామునులు **"పరమైకాంతి అయిన జ్ఞాని'** అని నిర్దేశించారు. గీతార్థసంగ్రహంలోని 28వ శ్లోకంలో **'యావత్ప్రాప్తి పరార్థీచేత్ తదేవాత్యంత మశ్నుతే"** (1. ఫలాన్ని పొందే లోగానే (కైవల్యార్థి, ఐశ్వర్యార్థి) పరమ ప్రాప్యం అయిన పరమపురుషుని శ్రీచరణాలనే ఎల్లప్పుడును పొందుతున్నాడు. 2. ఉపాసకజ్ఞాని ఫలాన్ని పొందేంతవరకు భగవానుని కోరితే, అతని శ్రీచరణాలనే ఎల్లప్పుడు పొందుతున్నారు) అని ఉపాసకజ్ఞాని ఫలాన్ని పొందేంతవరకు భగవానునే కోరకుండాపోవడనికి అవకాశం ఉన్నదని తెలిపి, తరువాత శ్లోకంనుండి అటువంటి నైచ్యానికి చోటు లేని పరమైకాంతి అయిన జ్ఞానినిగూర్చి తెలుపడం ఆరంభించి, **"జ్ఞానీ తు పరమైకాంతీ తదాయత్తాత్మజీవనః, తత్సంశ్లేషవియోగైక సుఖదుఃఖ స్తదేకధీః'** (29) (పరమైకాంతి అయిన జ్ఞాని అయితే, భగవానుని మాత్రమే ఆశ్రయించి తన జీవనాన్ని కలవాడై, ఆ భగవానునితో చేరితే ఆనందాన్ని, అతనిని విశ్లేషిస్తే దుఃఖాన్ని పొందేవాడై, అతని ఒక్కని విషయంలోనే తన జ్ఞానాన్ని కలవాడై ఉంటాడు). **"భగవద్ధ్యానయోగోక్తి వందనస్తుతి కీర్తనైః, లబ్ధాత్మా తద్గతప్రాణమనోబుద్ధీంద్రియక్రియః"** (30) (భగవానుని ధ్యానించడం, దర్శించడం, అతనిని గూర్చి సంభాషించడం, అతనిని నమస్కరించడం, స్తుతించడం, తిరునామసంకీర్తనం చేయడం- మొదలైనవానితో ప్రాణధారణ చేయగల్గినవాడు, భగవానునిపట్లనే అభినివేశాన్ని పొందిన ప్రాణం, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు మొదలైన వాని క్రియలను కలవాడు). **"నిజకర్మాదిభక్త్యంతం కుర్యాత్ ప్రీత్యైవ కారితః, ఉపాయతాం పరిత్యజ్య న్యస్యేద్దేవ తు తా మభీ"** (31) (తన వర్ణాశ్రమ ధర్మాలకు తగిన కర్మ మొదలుగా భక్తిపర్యంతం గల అన్నిటిని 'ఇవి ఉపాయం'' అనే భావనను విడచిపెట్టి (స్వామికి చెందినవి అనే) ప్రేమతో ప్రేరేపింపబడ్డవాడై (పరమైకాంతి యైన జ్ఞాని) చేయాలి.



భయం లేనివాడై, ఆ ఉపాయత్వాన్ని భగవానునిపట్ల అనుసంధించాలి). **"ఏకాంతాత్యంతదాస్యైక రతిస్తత్ పద మాప్నుయాత్, తత్ప్రధా మిదం శాస్త్ర మితి గీతార్థసంగ్రహః"** (32) (భగవానుని ముఖోల్లాసమే ప్రయోజనంగా కల్గినదై, అన్ని కాలాలలోను చేయబడేదైన కైంకర్యాన్నే కోరే పరమైకాంతి ఆ కైంకర్యానికి తగినట్లుగా భగవానుని శ్రీచరణాలను పొందుతాడు. ఈ గీతాశాస్త్రం చేతనుని పరమైకాంతిగా చేయడాన్ని ముఖ్యమైన ఉద్దేశ్యంగా కల్గినది. ఈవిధంగా గీతయొక్క అర్థాన్ని సంగ్రహంగా పలికే గీతార్థసంగ్రహమనే గ్రంథం పరిసమాప్తిని పొందుతున్నది.) అని గీతార్థసంగ్రహంలోని చివరి శ్లోకాలలో భగవానుని ప్రాప్యంగాను, భక్తియోగాన్ని ఉపాయంగా కల్గిన ఉపాసక జ్ఞానికంటే గొప్పవాడై భగవానునిపట్ల భక్తిని కల్గి ఉంటే తప్ప ధరించలేని స్వయంప్రయోజన భక్తిని కలవాడై, తాను చేసే కర్మ- జ్ఞాన- భక్తులలో ఉపాయబుద్ధిని లేనివాడైన పరమైకాంతిని రూపొందించడంలోనే గీతయొక్క ఉద్దేశ్యం- అని అనుగ్రహించి గీతార్థసంగ్రహాన్ని శ్రీయామునులు పూర్తిచేశారు.

దీనివల్ల ''భగవానుడే ప్రాప్యం, ప్రాపకం మొదలైన అన్నీ- అనే నిశ్చయంతో అతనిపట్ల స్వయం ప్రయోజనంగా భక్తిని కల్గి ఉండే పరమైకాంతికి భగవానుడు పరమమోక్షాన్ని నిర్హేతుకంగానే అనుగ్రహిస్తాడు. కర్మయోగం మొదలైన ఉపాయాలు అన్నీ ఇటువంటి పరమైకాంతులను రూపొందించే మార్గాలే'' అన్నదే గీతలో సారభూతమైన అర్థం- అని తెలుస్తున్నది.